విశ్వభారతి - 41
ప్రథమ ముద్రణ 1993
ద్వితీయ ముద్రణ 1994
ప్రతులు (C) - 500
వెల : రూ. 99/-

WRITER :
"Darsanacharya", "Bhru kalavadhani"
"Kala Bharathi"
**Dr. Akondi Viswanadham**, M.A., Ph.D
M.A., M.A., M.A, Bñ.P., P.O.L' S V.K D.I.H.
Associate Proffessor &
Head of the Department of Telugu,
Brundavan Nagar, ONGOLE - 523 002.
Prakasam Dist., A. P. INDIA.



## ప్రణవ గాయత్రి

ఓం కారాయ విద్మహే, భవ తారాయ ధీమహి ।
తన్నః ప్రణవః ప్రచోదయాత్ ॥

అంకితము




శ్రీ సాయీశుని చరణ సరోజములకు

For Copies :-
**Dr. Smt. Akondi Amarajyothi**, M.A.,
Secretary : VISWA BHARATHI
Brundavan Nagar, ONGOLE - 523 002, A.P. INDIA

శ్రీ గణేశ శారదా గురుభ్యోనమః

# కృతికర్త పరిచయము - విశ్వభారతి విజ్ఞప్తి

డా॥ ఆకొండి విశ్వనాథంగారి జన్మస్థలం కోనసీమ. వీరి జనయిత్రి శ్రీమతి సావిత్రి. పితృమూర్తి వేదవిద్యాభాస్కరులైన శ్రీ సూర్యనారాయణమూర్తి కృతికర్త, చిన్నారి పొన్నారి చిరుత కూకటినాటి నుండియే శ్రీ గాయత్రీదేవిని ఆరాధించుచూ, సావిత్రిని సేవించుచూ సంస్కృతాంధ్రాలు శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారిచెంత అధ్యయనం చేసారు. వీరు, తర్క వ్యాకరణ మీమాంస అలంకార దర్శన ధర్మశాస్త్రాదులను, వరుసగా శ్రీ కొల్లూరి సోమశేఖరశాస్త్రి, శ్రీ కాంపెల్ల సుబ్బరాయశాస్త్రి, శ్రీ బులుసు అపన్నశాస్త్రి, శ్రీ రాణి నరసింహశాస్త్రి, శ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రి, శ్రీ లంక వెంకటరామసోమయాజులుగార్ల చెంత అధ్యయనం చేసిన గురుకుల క్లిష్టులు. చిననాడే తండ్రిగారి చెంత కొంత వేదాధ్యయనం చేసి, ప్రస్థానత్రయాన్ని పఠించారు. త్రయిని, ఆచార్య త్రయాన్ని, కవిత్రయాన్ని గౌరవించి, సనాతన ధర్మోద్ధరణకై విశ్వభారతి ధార్మిక సంస్థను స్థాపించి, ప్రచురణ ప్రచారోద్యమాలు చేపట్టి లక్ష ప్రతుల సుచితరీతిని పంచారు. ఆసేతుశీతాద్రి పర్యటించుచు వేదోద్ధరణయే దేశోద్ధరణకు నాందియని, నాదమే వేదమని, ఓంకారదర్శనమే సుదర్శన సహస్రారసందర్శనమని, ప్రణవగాయత్రి దర్శనమే మోక్షమని బ్రహ్మజ్ఞానమును ప్రణిపాత, పరిప్రశ్న, సేవలచే తత్త్వదర్శినులైన సద్గురువులనుండి స్వీకరింపుడని, పరిపూర్ణ ప్రేమమే పరాశక్తియని ప్రబోధించుచున్నారు. సంస్కృతాంధ్రాలలో పరిశోధించి సిద్ధాంత వ్యాసాలను విశ్వవిద్యాలయాలకు సమర్పించారు. ఉపాచార్యులుగా సాహిత్య సౌరభాలను శిష్యులకు బోధిస్తూ అమృతవర్షిణి, రాసలీల అనే పద్యకావ్యాలు రచించారు. ఇవి, వీరి మహేశ శతకం, రాధికాశతకం మరికొన్ని ధర్శన గ్రంథాలు విశ్వభారతి ప్రచురించుచున్నది. వీరి ప్రతి రచనలోను ఒక క్రొత్త విషయం దర్శమిచ్చును. కనుబొమ్మల కదలికలతో ప్రపంచభాష లన్నిటిలోను చేయు ఏకైక ప్రక్రియను సృష్టించి, విశ్వమానవాళి మనోవికాసానికి నాంది పలికిన భ్రూకశావధాని వీరు. భగవద్గీతావధానాన్ని కూడ వీరు పలుచోట్ల ప్రదర్శించి ప్రశంసలు పొందారు. మాజీ గవర్నర్ డా॥ బెజవాడ గోపాలరెడ్డి, డా॥ దివాకర్ల, డా॥ దాశరథి, డా॥ మాణిక్‌ప్రభు, డా॥ సుమన్‌శ్రీ మొ॥ వారెందరో బిరుదములొసంగి సన్మానించారు. శతాధిక సంస్థలు సత్కరించాయి. ఆంధ్రప్రదేశ్ స్టేట్ జేసీస్‌వారు O. Y. P. అవార్డు బహూకరించి సన్మానించారు. వీరు ఒంగోలులో ఎజ్ఞనపీఠాన్ని స్థాపించారు. శంకరంపేటయందలి శ్రీచక్ర విద్యాప్రచారకమండలి గౌరవ సభ్యులు శ్రీ హనుమదాచార్య పీఠాధ్యక్షులు. శ్రీ విద్యారణ్యస్వామి సంస్థాధిపతి. ఇంకా ఎన్నోసంస్థలు నిర్వహిస్తూనే, విశ్వశాంతికై గ్రంథరచనచేస్తూ, సంస్కృతాంధ్రాల్లో కృతులు రచిస్తున్నారు. ఆచార్య భరద్వాజగారి గ్రంథాలు ఆవిష్కరించారు. సంస్కృతాంధ్రాలలో రేడియో ప్రసంగాలిస్తున్నారు. మహేంద్రసభ, భువనవిజయాల్లో

పాల్గొన్నారు, సుమారు 51 రచనలు ప్రచురించారు. వైద్యసేవ ఉచితంగా చేస్తున్నారు. వీరి ధార్మిక గ్రంథాలు విశ్వశ్రేయస్సుకు ధర్మామృత కలశాలు. సద్గురు కటాక్ష వీక్షణమే ఆధ్యాత్మిక విద్యా సముపార్జనకు మూలాధారమని, వేద ధర్మాలను ఆచరించి చూపుటకై అవతరించిన శ్రీరాముడు, వేదనాదాన్ని వేణునాదంలోను గీతాగానంలోను రుచి చూపిన శ్రీకృష్ణుడు రామకృష్ణ, వివేకానంద, శారదాదులు సద్గురువులై చేయు బోధలు భవబాధలను మాన్పునని, ప్రార్థనయే ప్రశాంతికి మూలమని, నిష్కామ సత్కర్మాచరణమే ముక్తికి మూలాధారమని, ప్రణవోపాసనయే పరమార్థమని బోధించుటయేకాక, తామాచరించును. ఇతరులను తరింపజేయుటకై 'అథాతో ప్రణవజిజ్ఞాసా' అను వీరి ప్రణవదర్శన సూత్రానికి భాష్యంగా 'ఓంకార దర్శన' గ్రంథమును విరచించి, బెంగుళూరునందు శ్రీ సత్యసాయిబాబాను దర్శించి, వారి బంగరు ఆశీస్సులను అందుకొని. తద్గ్రంథమును వారికంకితము గావించి. వారి కరస్పర్శచే కృతార్థులై శ్రీ గాయత్రీ దర్శనమును రచించి శ్రీ విద్యయే శర్మ. శర్మయే శ్రీవిద్యగా దర్శించి, సద్గురు శ్రీ జ్ఞానానందతీర్థుల కంకితముచేసి, శ్రుతి ధర్మాలను ప్రచారము గావించు వీరి దీక్షాదక్షతకు విశ్వభారతి కృతజ్ఞతలు. కాగితం ధర పెరుగుతున్నా ప్రచురించు విశ్వభారతికి దాతలు కార్యదర్శిపేర ఆర్థికసహాయము పంపచేసి, ప్రోత్సహించినచో వారి పేర్లు మా రచనలలో ప్రచురించి, గ్రంథాలు వారికి ఉచితంగా అందజేస్తాము. ఇది మీకూ మాకూ ఇహం పరం. —విశ్వభారతి.

డా॥ ఆకొండి విశ్వనాథంగారి రచనలు : విశ్వభారతి ప్రచురణలు :

1) మధుబిందువులు 2) రామాయణము 3) మహాభారతము 4) మారుతి 5) త్యాగరాజు జీవితసుధ 6) శ్రీమద్భారతి 7) మధ్వాచార్య 8) శ్రీదేవీభాగవతము 9) శ్రీ హనుమాన్‌చాలీసా 10) సుందరదర్శనం 11) ఎఱ్ఱనసూరకవి 12) విశ్వమానవ ధర్మాలు 13) ఆనంద రామాయణం 14) విశ్వగీత 15) ఉగాది పిలుపు(కవితలు) 16) పారిజాత సుమాలు 17) గాయత్రీ మంత్రమహిమ 18) సుందరప్రభ 1 భా. 19) వెంపరాల మహోత్సవ పత్రిక 20) శోధన 21) స్వామి వివేకానంద 22) కర్మయోగము 23) ఇందిరాలోకం 24) ఉపాఖ్యకథ 25) ఆనందకుసుమాలు 26) ప్రకాశపథం 27) పోతన 28) విద్యామృతం 29) కవిసార్వభౌము కాళిదాసు (సం॥) 30) అమృతకుసుమాలు 31) సుందరప్రభ 2భా. 32) అక్షరాంజలి 33) సుందరప్రభ 3భా. 34) ఎఱ్ఱన సాహిత్య కుసుమాలు 35) The Origin of Ramayana 36) సన్మానకథ 37) ఆచార్యప్రణుతి(సం॥) 38) గరిమెళ్ళమూర్తి 39) కాళిదాస్ కా కావ్యసౌష్టవ్ (హిం॥) 40) శ్రీ సాయిబాబా 41) ఓంకార దర్శనం 42) సంసారం (Marriage Life) 43) సద్గురుసామ్రాట్ 44) సద్గురు శ్రీ జ్ఞానానందతీర్థ 45) శ్రీ గాయత్రీ దర్శనం 46) వజ్రమహిమ 47) శ్రీ రాఘవేంద్రస్వామి 48) శ్రీ కన్యకాపరమేశ్వరీవ్రతకల్పం 49) శివదర్శనం సుదర్శనం 50) Omkara in Hindu Philosophy 51) దాంపత్యం మొ॥



# ఓంకార దర్శనము

ఓంకారం దివ్యామృతం. ఇది సముద్ర మథనంలోంచి వచ్చిన అమృతంకాదు. సృష్టికర్తలను సృష్టించిన దివ్యామృతము. ఇది దేవతలు త్రాగిన అమృతంకాదు. దేవతలకు కూడ దైవత్వాన్ని ప్రసాదించిన దివ్యామృతం ఈ అమృతం త్రాగినవారికి మరలపుట్టుకలేదు. బ్రతికినంతకాలం బ్రహ్మానందంలో ఉండేలాచేస్తుంది. ముక్తినిస్తుంది. త్యాగులు, యోగులు, విరాగులు నిరంతరం సేవించే దివ్యామృతం. ఇది భవరోగ పీడితుల పాలిటి చింతామణి, భక్తరక్షామణి.

ప్రతి జీవి పూర్ణసుఖం కోరుకుంటున్నాడు. కనబడే పదార్థాల్లో కాని, విషయ భోగాల్లో కాని వాస్తవసుఖం లేదు. ఇది ప్రతిబింబసుఖము క్షణికసుఖము. దుఃఖమిశ్రితము. అవిచ్ఛిన్న పరిపూర్ణసుఖం కావాలంటే చిత్తశాంతి కావాలి. శాంతిలేని మనస్సులో సుఖానికి స్థానంలేదు. ప్రతి జీవి మనస్సు శాంతి ఆశ్రమం కావాలి. ఆత్మచింతన వలననే శాంతి లభిస్తుంది. ఆత్మచింతన చేయుట అనగా దైవమును గూర్చి చింతించుట. అనగా ధ్యానము చేయుట. దైవధ్యానమువలన చిత్తశాంతి కల్గును. బుద్ధి శుద్ధముగా నున్నపుడే దైవధ్యానముకల్గును మనస్సు పరిశుద్ధంగా ఉంటేనే ఆత్మచింతనకు అవకాశము ఉంది. మనస్సు నిర్మలంగా ఉండాలంటే ఇంద్రియ నిగ్రహంకావాలి. ఇంద్రియ నిగ్రహంవల్ల, మనస్సంయమము, దానివలన, విషయవిరక్తి, దానివలన, మనస్సు నిర్మలమగును అంత ఆత్మచింతన ప్రారంభమగును. దైవధ్యానము వలన శాంతి ఏర్పడును. శాంతియే సుఖమునిచ్చును. అదే శాశ్వత సుఖము ఆ బ్రహ్మానందానుభూతికై యోగులెందరో నిరంతరం కృషిచేసి, సాధిస్తున్నారు.

మధురమైనది మకరందం. మకరందం అంటే తేనె. తేనెలో రోగ వినాశకర శక్తి ఉంది. కనుక, దీన్ని ఔషధాల్లో ఉపయోగిస్తారు. ఇది శారీరక రోగాన్నే పోగొట్టుతుంది. అట్టి తేనె తియ్యగా ఉంటుందని మనకి బాగా తెలుసు. మనకే కాదు, తిర్యగ్జంతువైన తుమ్మెదకు కూడ తెలుసు. కనుకనే, "మందారమకరంద మాధుర్యమున దేలు మధుపంబు పోవునే మదనములకు" అన్నారు పోతన్నగారు. మకరందం కన్న మధురమైన పదార్థం మనకు తెలియక పోవడంవల్ల, ఇదే మధురమని. ఆహా! అని దీన్ని పొగడి, ఇది త్రాగి సంతోషిస్తునాం. మకరందం కన్నా మాధుర్యం కల్గింది అమృతం. దీని రుచి మకరందం కన్నా కొన్ని కోట్లరెట్లు అధికంగా ఉంటుందని అంటారు. ఇది మధురాతి మధురమైంది. అంతే కాదు ఇది త్రాగితే నిత్య యౌవనం వస్తుంది. చావులేదు. స్వర్గసుఖాన్ని పొందవచ్చు. ఇలా అని మనం విన్నాం మధురాతి మధురమైన అమృతం మనకు దొరికితే - ఒదిలిపెడతామా ? ఇది త్రాగిన తర్వాత - ఇది వరకు త్రాగిన తేనె - దీని ముందర చప్పగా కనబడుతుంది. కనుక అమృతాన్ని మనం ఒదలం. మనమేకాదు - రాక్షసులే ఒదలడానికి ఒప్పుకోలేదు. కాని, వాళ్ళకి అమృతం ఆస్వాదించే అదృష్టం లేకపోయింది. ఆ అదృష్టం అమరులకే దక్కింది. అందిన అమృతాన్ని దేవతలందరూ ఆస్వాదించి. ఆనందాన్ని అనుభవిస్తున్నారు. ఆ ఆనందంకూడా అశాశ్వతమైందె. బ్రహ్మానందం మాత్రం కాదు. వారు త్రాగిన అమృతంలో ముక్తిని ప్రసాదించే శక్తిలేదు. అది భోగామృతం మాత్రమే.

ముక్తినిచ్చే, శక్తిని ప్రసాదించే దివ్యామృతం - ఓంకారామృతం ఇది మకరందం కన్నా, మధురాతి మధురమైన అమృతం కన్నా, గొప్పదై - శాశ్వత బ్రహ్మానంద మాధుర్యాన్ని చవిచూప గల్గిన దివ్యామృతం. ఇంతటి మహత్తర శక్తిగల దివ్యామృతం లభిస్తే - భోగామృతాన్ని వాసన కూడ చూడం. త్రిమూర్తులీ దివ్యామృతాన్ని ఆస్వాదించి, ఆనంద డోలికల్లో తేలుస్తున్నారు. మనకూ ఆ బ్రహ్మానందం దొరకాలంటే - ఓంకారదర్శన మొక్కటే మార్గం.

మధురామృతం - అధరామృతాన్నే అందించగలదు. అతి మధురాతి మధుర దివ్యామృతం - ముక్తిని, శాశ్వత బ్రహ్మానందాన్ని ఇవ్వగల్గిన ఓంకార అధర మధురామృతాన్ని అందించగలదు.

అశాశ్వత సుఖ సంతోషాలకు నిలయమైన అధరామృతం కావాలో - శాశ్వత సుఖసంతోషాలను ప్రసాదింపగల్గి, ముక్తికి నిలయమైన ఓంకార దివ్యామృతం కావాలో శాంత చిత్తులై సంప్రదించండి. మీకే తెలుస్తుంది తన ఆకలిని తానే, అన్నము తిని పోగొట్టుకోవాలి. అంతేగాని ఇంకొకడు తింటే తన ఆకలి తీరదు. అట్లే తన్ను తానే ఉద్ధరించుకోవాలి. తన రోగమునకు తానే మందుతిని నయము చేసికొనినట్లు, భవరోగ పీడితుడు జీవుడు తానే స్వయముగ సాధనచేసి తరించాలి. తమ్ము తాము ఉద్ధరించుకొన యత్నించువారికి గురువులు, దైవము సహాయం చేస్తారు. కావున వేదములందలి అర్థము గ్రహించి, అందు తెలిపి నిష్కామ కర్మలాచరించి, భక్తుడై జ్ఞానముపొంది, ముక్తి పొందాలి.

అమృతానికే అమృతత్వాన్నిచ్చిన మధురామృతం - ఈ దివ్యామృతం. సమస్త వేదమంత్రాలకి ప్రాణం పోసిన మధురామృతం - ఈ దివ్యామృతం. ఆదివిష్ణువు అడుగడుగునా ఆరాధించే అమృతం. అజుడు అన్నివేళలా ఆస్వాదించు అమృతం. మహా దేవదేవుడు మనసా గ్రోలు మధురామృతం - ఈ దివ్యామృతం. అమృతం త్రాగిన అమరులు సైతం అహర్నిశలూ ఆరాధించి తరించే మధురామృతం - ఈ దివ్యామృతం. అదే - ఓంకారామృతం.

ఓంకారదర్శనమున తగిలిన మనస్సేమనస్సు. మనస్సే సమస్త ప్రయోజనములకు హేతువు. ఓంకార మందే మనస్సు లగ్నమయితే ఇంద్రియంబులన్ని ఆ వంకకే వచ్చును. ఓంకారామృతమునే [illegible] చును. కారణం - ఏ వంకకు మనస్సు లగ్నమయితే - ఆ వంకకే ఇంద్రియాలన్నీ వెడలును. మతి - ఓంకారమందే మనస్సు లగ్నమయితే -

ఇంద్రియాలింకెక్కడికి వెళ్ళగలవు? కావున ప్రతి వ్యక్తి ఈ దివ్యామృతాన్ని సేవించి, తరించాలి. "ఈ దివ్యామృతాన్ని సేవించి తరించే వారి వంశంలో - అధ్యాత్మిక జ్ఞాన సంపన్నుడు, సంస్కారవంతుడు జన్మిస్తాడు అంటే బ్రహ్మజ్ఞాని పుట్టును." మధుర దివ్యామృతంలోనుండి ఉద్భవించు ఫలాలు - దివ్యామృత ఫలాలే. ఇవి ముక్తి ఫలాలు. ఈ రహస్యం మాండూక్యోపనిషత్తులో చెప్పబడింది. ఈ దివ్యామృతాన్ని సేవించిన వారికి మంచి సంతానం కలుగుతుంది. కోరిన కోరికలు సిద్ధిస్తాయి. ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధి చేకూరుతుంది. సుఖసంతోషాలతో జీవిత కాలం గడుస్తుంది. ఈ దివ్యామృతాన్ని మధించగా, మధించగా అంత్యకాలానికి దివ్యామృత ఫలం మీకు లభిస్తుంది. దాన్ని స్మరించి దేహం వదలిననాడు - దేహి ఓంకారం చొప్పును. అదే విదేహ ముక్తి అన్నారు వేదాంతులు. ఇది సర్వ వేదాన్త తాత్పర్యము - [ఓం]

పరబ్రహ్మమునకు వాచకమైన "ఓమ్" అను ఒక్క అక్షరమును ఉచ్చరించుచు నన్ను [ఓంకారమును] ఎడతెగక చింతించుచు [ధ్యానించుచు] ఎవడు శరీరము వదలునో అతడు మోక్షమును [సర్వోత్తమమైన స్థానమును] పొందుచున్నాడు.

వేదములసారము ఉపనిషత్తులు. ఉపనిషత్తుల సారము - భగవద్గీత. గీతాగానము చేసినవారు శ్రీకృష్ణ పరమాత్మ గీతాసారము - ఓంకారము. సమస్త వేదములందు ఓంకార స్వరూపుడనని, ఓం వలననే బ్రహ్మజ్ఞానులు, వేదములు, యజ్ఞములు నిర్మింపబడినవని, శ్రీకృష్ణ పరమాత్మ చెప్పెను.

శ్లో॥ ఓ మిత్యే కాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్దేహం సయాతి పరమాంగతిమ్॥

భగవద్గీత 8అ 13 శ్లో.

ఇది పరబ్రహ్మమునకు వాచకము. వేదసారము [ ప్రణవ స్సర్వ వేదేషు ]. మంత్రములలో కెల్ల గొప్పది. ధ్యానించుటకు చక్కని మంత్రము. ఇంతకన్న చిన్న మంత్రము లేదు, ఇంతకన్న మహత్తర మైన మంత్రము లేదు. అదియే "ఓం" కారము.

"ఓమ్" కారమును ఉచ్చరించుచు - మాటి మాటికి చింతన చేయవలెను. అనగా "ఓమ్" అను ఏకాక్షరమైన ప్రణవ మంత్రమును జపించుచు ప్రణవార్ధమగు పరబ్రహ్మమును ఎవడు బాగుగ చింతించు చుండునో, అట్టివాడు మోక్షమును పొందును. ఎవరైనను సాధన చేయ వచ్చును దీనికి జాతి, లింగ, మత, వయోభేద మనలే లేదు. దీని అను ష్ఠాన విషయములో సర్వ మానవులకు సమానమైన హక్కున్నది. త్రికరణశుద్ధిగా విషయవాంఛలను విడనాడి, నిష్కామ బుద్ధితో ఈ మంత్ర రాజము నుచ్చరించవలెను. మామ నుస్మరన్ - అని చెప్పుటచే - ఓంకారమును కేవలము ఉచ్చరించినంత మాత్రమున చాలదనియు, మంత్రార్ధము తెలిసికొని ధ్యానించిన పరిపూర్ణ ఫలితము కల్గునని భావము. అర్ధము తెలియని చదువు వ్యర్థమే కదా!

ఓంకార ధ్యానము త్రికరణశుద్ధిగా, అంటే మనసా, వాచా, కర్మణా ఆచరించిన వారికి మధురానుభూతి కల్గుతుంది. శరీరమున్నంత కాలం సుఖ జీవితం గడుపుతారు. వేదములు, శాస్త్రములు, మున్నగున వన్నియు బ్రహ్మ పదార్ధ మున్నదని ప్రమాణ పూర్వకముగా నిరూపించు చున్నవి. ఉత్తమ స్థితి పొందే వ్యక్తి శ్రుతి, స్మృతి, వేదాన్త, శాస్త్ర, ఆచార్య వాక్యముల యందు శ్రద్ధవహించి బ్రహ్మమున్నదని నమ్మిన ముక్తి కల్గును. శ్రద్ధ - కార్య సిద్ధికి ముఖ్య కారణం. గురువాక్యములు, వేదాన్త వాక్యములు యదార్ధములే యని, వానియందు దృఢ విశ్వాసం కల్గి యుండుటే శ్రద్ధ. శ్రద్ధ ముక్తికి సులభ సాధనము. మనిషికి గల శ్రద్ధ మీదనే కార్యసిద్ధి ఆధారపడి యున్నది. పై తెలుపబడిన వాక్యము

(కొరాన్) "భగవంతుని నామమును ప్రాతః కాలమునను సాయంకాలమునను కీర్తింపుము." 29వ భాగము. ఈ రీతిగా పలుచోట్ల భగవంతునకు అనేక నామములున్నవనియు, బంగారపు వస్తువులు వేరువేరుగానున్నను, వాటన్నిటి యందున్నది బంగార మొకటే యున్నట్లు భగవంతుడొకడే - ఆతనికి అద్భుతశక్తి ఉన్నదని, ఆతని యందు విశ్వాసము కల్గి ఉండవలెనని, భగవంతుని స్మరించుటయే గొప్ప సాధన - అని కొరాన్ చెప్పుచున్నది.

వీరు "అల్లాహూక్ అక్బర్" [God is great] భగవంతుడొక్కడే శక్తిమంతుడని వీరు ప్రార్థించెదరు. ఇందెంతయో అర్థమున్నది వీరు ఈ నామస్మరణ చేయునపుడు, ఊ కారము చివర మూడు మాత్రలపై కాలము దీనిని ఉచ్చరించెదరు. ఇందు ఓమ్ వినవచ్చును. అకారము ప్రారంభము, మధ్య ఉకారము గలదు. మకారము స్పష్టముగా కాక అంతమించిన నిశ్శబ్దమొకటి వినిపించును. ఈ రహస్యమే సర్వమతముల సారము. అదే విదేహ ముక్తియని సర్వమతాచార్యుల సిద్ధాంతము అదే పరబ్రహ్మము. సంసారమునుండి తరించవలెనన్న నామస్మరణయే ధన్యోపాయము. దీనిని ప్రతిపాదించిన వే సర్వమతములును. సర్వశక్తి సంపన్నుడైన భగవంతుని గూర్చి తెలుపుటయే సర్వమత సిద్ధాంతసారము

యేసు అను శబ్దమునకు రక్షకుడని అర్థము. క్రీస్తు అను శబ్దమునకు అభిషిక్తుడని యర్థము. యేసు జన్మించుటకు కారణము - మానవులు చేయు పాపములను తొలగించుటకని బైబిలు చెప్పుచున్నది. "తన ప్రజలను వారి పాపముల నుండి అయనే రక్షించును కనుక అయనకు యేసు అని పేరు పెట్టుదువని" యోసేపు స్వప్నములో ప్రభువు చెప్పెను. యేసు - పరిశుద్ధాత్మ వలన కలిగెను. [మత్తయి 2అ. 21] "దేవుని కృపావరము మన ప్రభువైన క్రీస్తు యేసునందు నిత్య జీవము." [రోమా. 6 : 23]

ప్రార్థనయే పరమార్థమని, పరిశుద్ధాత్మ కలదని, అదియే దైవమని - ఈ రహస్యము తెలిసికొని దైవమునే నమ్ముమని క్రీస్తు చెప్పెను. ప్రార్థన వలననే రక్ష ఏర్పడును.

"ప్రభువు నామమును బట్టి ప్రార్థన చేయువాడెవడో వాడు రక్షింపబడును" [రోమా 10 : 13] ఈ రీతిగానే "ఓ ప్రభువా?" - అని ప్రార్థన చేయుచున్నారు. ఎవరు పిలిచినను "ఓ"కారముతోనే పిలుచుచున్నారు. ఓంకారము దీర్ఘముగా కూడ పిలచెదరు క్రీస్తు ప్రభువు కూడ ప్రాణము వదలు సందర్భమున బిగ్గరగా కేకవేసెను. అది ఓంకారమే. కారణము కేక ఎప్పుడు ఓ కారముతో ప్రారంభించెదరు. సంబోధనలో ఓరి, ఓసి, ఓయి - అందురు. ఇది బిగ్గరగా వేసినకేక. ఇందు ఓంకారమే ఉండి యుండుటకు ఈ హేతువు లాధారములు. ఏ భాషలోనైనను సంభోధనార్థమునిచ్చు కేకలోని అర్థము ఓంకారమే. ఇది సూక్ష్మపరిశీలన వల్లనే తెలియును. "ఏలీ, ఏలీ, లామా సబక్తానీ" - అని క్రీస్తు కేక. "నాదేవా! నాదెవా! నన్నెందుకు చేయి విడిచితివి" - **అని** అర్థము. ["At about tree O'clock Jesus cried out with a lond shout" "Eli, Eli, Lama Sabachathani?"] యేసు మరలా బిగ్గరగా కేకవేసి ప్రాణము విడిచెను. [Jesus again gave a lond cry, and Greatted his last] అంత క్రీస్తు పరిశుద్ధ పట్టణములో ప్రవేశించెను. ఈ రీతిగా పరమాత్మలో ఆత్మ ఏకమాయెను. కావున ఈ పై విషయము వలన మనలందరకు దైవము ఒకడున్నాడని, అతడు సర్వశక్తిమంతుడని క్రీస్తు చెప్పెను. అతడే యేసుప్రభువే అంత్యకాలములో దైవప్రార్థన చేసి ప్రాణము వదలెను. కనుక అంత్యకాలములో ఎవరు దేనిని స్మరింతురో వారు ఆ భావము పొందెదరు. కావున దైవమును స్మరించి క్రీస్తు ధన్యుడయ్యెనుడాయెను.

బైబులు ప్రకారము కూడ దైవచింతనయే ప్రధానమని తెలియుచున్నది. దైవచింతన కూడ దైవార్పిత బుద్ధితో చేయవలెనని క్రీస్తు చెప్పెను. మతములు వేరైనా మతప్రవక్తల సారాంశము ఒక్కటియే. రహస్యముగా దైవమును ప్రార్థించాలి. "నీవు నీ ప్రార్థన చేయునపుడు నీ గదిలోనికి వెళ్ళి తలుపువేసి, రహస్యమందున్న నీ తండ్రికి ప్రార్థన చేయుము. నీకు ప్రతిఫలమిచ్చును" [But when you pray, go to your room and close the door, and pray to your Father, who is unseen, Aad your Father, who sees what you do in private, will reward you

దై వా రా ధ న :

ప్రార్థనలో కూడ నామమహత్త్వమే చెప్పబడింది. "నీ నామము పరిశుద్ధ పరచబడుగాక!" [May your holy nome be honoured]. ఆ నామమే గౌరవింపతగినది. అని క్రీస్తు అభిప్రాయము. ఆ దైవారాధనయే సర్వమతసారము. ఇంకొక రహస్యమేమన, ఓంకారమందు మూడు [3] అక్షరములు గలవు. ఇవి సమస్త జగత్తునందలి సర్వత్రిపుటులయొక్క సూచకములు.

## త్రి పు టు లు

సృష్టి, స్థితి, లయాలు — కార్యత్రయము
స్థూల, సూక్ష్మ, కారణాలు — దేహత్రయము
ఆధ్యాత్మిక, అధిదైవిక, అధిభౌతికాలు — తాపత్రయము
జాగ్రత్, స్వప్న, సుషుప్తులు — అవస్థాత్రయము
సత్త్వ, రజస్, తమస్సులు — గుణత్రయము
విషయానంద, వాసనానంద, బ్రహ్మానందములు — సుఖత్రయము
మనుష్యానంద, దేవానంద, బ్రహ్మానందములు — ఆనందత్రయము
శాంత, ఘోర, మూఢములు — వృత్తిత్రయము
భూః, భువః, స్వః — వ్యాహృతిత్రయము

భూత, భవిష్య, వర్తమానములు — కాలత్రయము
స్వర్గ, మర్త్య, పాతాళములు — లోకత్రయము
పృథివీ, అంతరిక్ష, ద్యులోకాలు — లోకత్రయము
బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు — మూర్తిత్రయము
మహాసరస్వతీ, మహాలక్ష్మి, మహాకాళి — దేవీత్రయము
వసు, రుద్ర, ఆదిత్యులు — దేవత్రయము
అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతములు — మతత్రయము
పుణ్య, పాప, మిశ్రమములు — కర్మత్రయము
ఆగామి, సంచిత, ప్రారబ్ధములు — కర్మత్రయము
ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులు — శక్తిత్రయము
ఋగ్యజుస్సామములు — వేదత్రయము
జ్ఞాన, కర్మ, ఉపాసనలు — కాండత్రయము
ఉదాత్త, అనుదాత్త, స్వరితములు — స్వరత్రయము
నాభి, హృదయ, భ్రూమధ్యములు — స్థానత్రయము
ఐహిక, ఆముష్మిక, మిశ్రమములు — వైరాగ్యత్రయము
బాహ్య, అనన్య, ఏకాంతములు — భక్తిత్రయము
నేత్రద్వయము, జ్ఞాననేత్రము — నేత్రత్రయము

[మూడు నేత్రములు గలవాడు - త్రినేత్రుడు లేక
నేత్రద్వయము + భ్రూమధ్యము = నేత్రత్రయము]

అంతర్, మధ్య, బాహ్యములు — లక్షత్రయము
సంజ్ఞాన, విజ్ఞాన, ప్రజ్ఞానములు — జ్ఞానత్రయము
సూర్య, చంద్ర, అగ్నులు — మండలత్రయము
జీవన్ముక్తి, విదేహముక్తి, క్రమముక్తి — ముక్తిత్రయము
బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు — ద్విజత్రయము
వాఙ్మౌన, అక్షమౌన, కాష్ఠమౌనములు — మౌనత్రయము

దక్షిణ, గారవాపత్య, అహవనీయాగ్నులు — అగ్నిత్రయము
ఋషి, పితృ, దేవఋణములు — ఋణత్రయము
మాత, పిత, ఆచార్యులు — గురుత్రయము
వాత, పిత్త, శ్లేషములు — తత్త్వత్రయము
బాల్య, యౌవ్వన, వార్ధక్యములు — అవస్థాత్రయము
దారేషణ, ధనేషణ, పుత్రేషణలు — ఈషణత్రయము
ఇడా, పింగళా, సుషుమ్నలు — నాడీత్రయము
దృక్, వాక్, స్పర్శదీక్షలు — దీక్షాత్రయము

ఇట్లే పాపత్రయము, కర్తృత్రయము మున్నగునవి కలవు జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత, .... ధ్యానము, ధ్యేయము, ధ్యాత, దృక్, దృశ్య, ద్రష్టలు — ఇత్యాది రీతిగా సమస్త ప్రపంచము త్రిపుటుల యందాధారపడి యున్నదని కొందరనిరి క్రైస్తవ త్రిపుటి యొక్క భావముపై వారి భావమును ఏకీభవించుచున్నది. తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ - క్రైస్తవ త్రిపుటి [The Father, the son and the Holy spirit] ఇంకను ప్రస్థానత్రయము, ఆచార్యత్రయము, శ్రేణిత్రయము, లింగత్రయము, మతత్రయము, కవిత్రయము - ఇత్యాదులెన్నియో ఉన్నవి.

ఓంకారమందలి అక్షర సంఖ్య మూడు [3] మూడుచే ఏ సంఖ్యను గుణించినను, ఆ గుణింపగా వచ్చిన అంకెగాని, అంకెల మొత్తము గాని, మూడుగాని. మూడుచే సరిగా భాగింపబడు సంఖ్య అగును. ఓం అను అక్షరమునుండియే సమస్త అక్షరములు పుట్టుచున్నవి. అంకెలు పుట్టుచున్నవి. సంఖ్యాశాస్త్రము ఓంకారాంతర్గతమే. ఓంకారమే పరబ్రహ్మము, సమస్త, సృష్టి, స్థితి, లయా సూచకమై, దానికన్నను అతీతమై సమస్త జగత్తంతయు నిండియున్నది - ఓంకారమొక్కటే అని

తెలియుచున్నది. ఓంకారము ఉచ్చరించిన తర్వాత నిశ్శబ్ద సమాధి స్థితిలో కలుగు దివ్యానుభూతియే పరబ్రహ్మము అని స్వానుభూతివే ఎవరైతే తెలిసికొనునో అతడే పరబ్రహ్మము.

ఈ రీతిగా ఓంకారార్థము తెలిసికొని, ధ్యాననిష్ఠ గలవాడే ధన్యుడు ఓంకారార్థము అనంతమైనది. అది రేఖామాత్రముగా పైన తెలుపబడినది.

## నిర్భయమైన బ్రహ్మయే ఓంకారము

శ్లో॥ యుంజీత ప్రణవే చేతః, ప్రణవం బ్రహ్మనిర్భయం.
ప్రణవే నిత్య యుక్తస్య నభయం విద్యతే క్వచిత్

ఓంకారములో నీ మనస్సును ముంచివేయుము ఆ ప్రణవ ధ్వనితో నీ మనస్సును ఐక్యము చేయుము. నిర్భయమైన బ్రహ్మయే - ఆ ఓంకారము. ఆ ఓంకారముతో ఐక్యము పొందినవానికి యెట్టి భయము లేదు. భయము లేనివానికి ఎల్లప్పుడు శుభము కల్గును.

ఓంకారంతో మనస్సు ఐక్యం కావాలి. అలా అయితే ఓంకారమే బ్రహ్మ కావున - బ్రహ్మనుభవముచే బ్రహ్మనందము కల్గును. అదే - అహం బ్రహ్మాఽస్మి ఈ అద్వైత భావనలో భయమెక్కడిది ? సర్వభయాలకు కారణం - ద్వైతభావము. ద్వైతం - అద్వైతంలో ఉండలేదు. తదేక ధ్యానంలో ఏకత్వ స్థితి కల్గుతుంది. అపుడు మనస్సు లేదు. కావున ద్వైత భావము నశించి, అద్వైతస్థితి కల్గును.

సర్వవికారాలకి, భయాలకి కారణం మనస్సు అట్టి మనస్సు ఓంకారమందు ఏకాగ్రం చేస్తే - ఓం కారంపై నా మనస్సు లేదు కావున - సంకల్ప వికల్పాలకు కేంద్రమైన మనస్సు లేకుండుటచే భయం ఉండటానికి చోటేలేదు.

తెలిన సారాంశ మేమన, మనస్సు - ఓంకారమందు నిలిపి, దర్థమును ధ్యానించు సాధకునకు - మోక్షము కరతలామలకము. అట్టి సాధకుడు ఇహలోక మందున్నంత కాలము ఆనందించి, తదనంతరము శాశ్వత బ్రహ్మానందము పొందును. దీనికి కారణము ఓంకార - స్మరణ, కీర్తన, శ్రవణ, ధ్యానాలనియే చెప్పాలి ఇవన్నియు ప్రథమ సోపానము.

భయము లేనివానికి ఎల్లప్పుడు శుభము కల్గును. అని చెప్పుటచే సకల దుర్గుణములకు భయమే పునాది. కావున భయరాహిత్యము ప్రధానము. దుర్గుణములను పారద్రోలినచో సుగుణములన్ని అవలీలగా వస్తాయి. సుగుణముల వలన దైవసంపత్తి కల్గును. డంబము, గర్వము అభిమానము, కోపము, కాఠిన్యము, అవివేకము మొదలగు దుర్గుణములను పారద్రోలిన సుగుణములు కల్గును. ఈ దుర్గుణములు వలన సంసార బంధము కల్గును. దానిచే దుఃఖము, దానివలన అధఃపతనము జరుగును. వారి దుఃఖము అపవిత్రమైనది. కామాదులనుభవించుటకై కల్గినది. వాడు గర్వాంధుడు. ఇట్టి వారు నరకమునకే పోదురు. కావున సుగుణముల నాశ్రయించాలి సుగుణములలో శ్రేష్ఠమైంది - నిర్భయము నిర్భయము సాధకునికి అత్యంత ఉపయుక్తము. కావున భయమున్న లేకుండుట, చిత్తశుద్ధి, జ్ఞానయోగస్థితి, దానము, బాహ్యేంద్రియ నిగ్రహము, గీత, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, యోగవాసిష్ఠము, భారత, భాగవతరామాయణములు, ఆస్తిక దర్శనములు, శంకరాదుల భాష్యములు మొదలైన ఆధ్యాత్మిక గ్రంథములను నిత్యము పఠించుచుండుట, శారీరక మానసిక వాచిక తపస్సులను చేయుట, త్రికరణ శుద్ధిగ మెలగుట, శరీరముతో గాని, వాక్కుతో గాని, మనస్సుతో గాని, ఏ ప్రాణిని బాధపెట్టకుండుట, పరమాత్మనే [అనగా ఓంకారమునే] ధ్యానము చేయుట, కోపమును బూడిద చేయుట, కర్మఫలత్యాగము చేయుట, చిత్తమును శాంతి నిలయముగ చేయుట, కొండెములు చెప్పకుండుట, సమస్త

ప్రాణులయందు దయకల్గియుండుట, ఇంద్రియ లోలత్వము లేకుండుట అనగా మనస్సు నిశ్చలముగా నుంచుట, మాటలయందును చేతలయందును, కాఠిన్యము చూపక మృదువుగా నుండుట పాపకార్యములు చేయుటలో సిగ్గుకల్గి వాటిని దాటినిత్యజించుట తాను ఉన్నతస్థితి కింకను రాలేదేయని సిగ్గుపడుట, దైవధ్యానము నుండి చలింపకుండుట, బ్రహ్మ తేజస్సు కలిగియుండుట. ధైర్యము కలిగియుండుట. ఓర్పు శుచిత్వము అభిమాన రాహిత్యాలు సుగుణములు. నమ్రతా సత్యముగా మాట్లాడుట మంచిగుణము సమస్త జీవులను ప్రేమించవలెను. ప్రేమలేని జీవితము శ్మశానము ఈ రీతిగా మంచి గుణములు. కలవాడై, త్రిగుణాతీతుడై ఎవడు ఓంకారమును ధ్యానించునో వాడు ఆత్మజ్ఞానము పొందును.

ఆత్మ – నాశనరహితము. నిర్వికారము, శాశ్వత ధర్మ స్వరూపము, అచంచల ఆత్మ స్మరూపమని తెలిసికొనును. ఆత్మ స్వరూపము తెలియుటచే శోకము తొలగును. ఈ స్థితి తెలియక పోవుటచే మొదట అర్జునుడు శోకించెను. జ్ఞాని – మరణించిన వారి గురించి గాని. జీవించి ఉన్నవారి గురించిగాని విచారింపడు. జీవునికి శరీరము – మన చొక్కా లాంటిది చిరిగిన పాతచొక్కా విడిచి, క్రొత్తచొక్కా మనము ధరించునటుల – ఆత్మ శిథిలమైన పాత శరీరాన్ని వదలి, కొత్త శరీరాన్ని ధరిస్తుంది. ఇది బాల్య, యౌవన. వార్ధక్యాలెలా వస్తాయో, అలాగే దేహాంతర ప్రాప్తి కూడ కల్గుతోంది. ఆత్మకు పుట్టుకలేదు. చావు లేదు. శాశ్వతుడు, పురాతనుడు. శరీరం చంపబడ్డా. ఆత్మ చంపబడదు. ఆత్మని అగ్ని దహింపలేదు. నీరు తడుపలేదు గాలి ఎండింపలేదు. ఏ అయుధాలు ఛేదించలేవు ఆత్మనాశనం లేనిది. ఆత్మ ఇంద్రియములకు గోచరింపదు సమస్త ప్రాణి కోట్లయందున్న ఆత్మ ఒక్కటియే బల్బులెన్ని యున్నను. ఎన్నిరకాలుగానున్న, అందున్న విద్యుత్ ఒక్కటియే. కావున ఇట్టి ఆత్మ జ్ఞానము కలవాడు అహంకార మమకార వర్జితుడై శాంతిని పొందును.

కీటకం భ్రమరంగా మారునట్లు జీవుడు బ్రహ్మ స్వరూపుడగును. ఇట్టి బ్రహ్మీ స్థితిని పొందినవాడు మరల విమోహము పొందడు. అంత్య కాలము నందుకూడ ఇట్టి స్థితిలో ఉన్నవాడే బ్రహ్మానంద మోక్షము పొందును. అంత్యకాలమందు కూడ - అనుటచే పుట్టినది మొదలు ప్రతి నిమిషము బ్రతికున్నంత కాలము [బాల్య యౌవన కౌమారాది అన్ని అవస్థలలోను] దైవధ్యానము చేయవలెను. అట్టి బ్రహ్మీ స్థితియే బ్రహ్మా నంద మోక్షము

## ఓంకారమే అపరబ్రహ్మ

శ్లో॥ ప్రణవోహ్యపరం బ్రహ్మ ప్రణవశ్చ పరః స్మృతః ।
అపూర్వోఽనన్తరోఽబాహ్యోఽనపరః ప్రణవోఽవ్యయః॥

ఓంకారమే అపరబ్రహ్మ. ఓంకారమే పరబ్రహ్మ ఆ - ఓంకారము - అపూర్వము, అనంతము, అబాహ్యము, అనపరము, అవ్యయము

అద్వైత వేదాంతులలో కొందరు, కనబడు ఈ ప్రపంచమునకు సంబంధాపేక్ష కలదని, ఈ ప్రపంచము అపరబ్రహ్మ అని అంటారు పరబ్రహ్మయే, నామరూపాది గుణములతో కలిసి ఈ ప్రపంచరూపంలో భాసిస్తాడని వారి ఉద్దేశ్యము. ఈ అపరబ్రహ్మ వేదాంతం ప్రకారం ఉపాసకునికి ఆరాధ్యం అవుతోంది. దీన్నే వేదాంతభాషలో సగుణబ్రహ్మ అన్నారు దానిని సనాతన వేదాంతులు అంగీకరించరు. ఈ దృశ్య ప్రపంచం ద్వారా సాధకుని సత్యతత్త్వములోనికి చేర్చుటయే నవీన వేదాంతుల మతము. ఓంకారము పరమాత్మకు ప్రతీక మరియు దృశ్య ప్రపంచమునకు కూడ ప్రతీకయే. కావున ఓంకారము సర్వవ్యాపి. ఓంకార తత్త్వము పరాపర బ్రహ్మప్రాప్తికి సాధనము.

"ఓం" అను అక్షరమే సమస్తము అయ్యున్నది. చెప్పేదంతా "ఓం" గురించిన వ్యాఖ్యానమే. భూత భవిష్యద్వర్తమానములు ఓంకారమే ఈ మూడింటిని అతిక్రమించినదేదిగలదో అదంతయు ఓంకారమే. కోట్ల

కొలది మట్టికుండలకు మూలము మట్టియే. మరొకటి కాదు. అట్లే ఈ కనబడు ప్రపంచమందలి వస్తువు లన్నింటికి శాశ్వత దివ్యతత్త్వము మూలమై యున్నది. ఈ మట్టికుండలన్నీ మట్టిలోపుట్టి, మట్టిలో పెరిగి మరల మట్టిలోనే కలియుచున్నవి. ప్రపంచమూ కూడ అట్లే పరతత్త్వ మందు సృష్టి స్థితి లయము గలది. ఈ మూడింటికి ఆధారమైన సర్వ వ్యాపిశుద్ధ చైతన్యమే. "ఓం" శబ్దార్థములు విడిగాలేవు. అవు - అనగానే ఆవు అను జంతువు తెలియుచుగాని, మేక స్ఫురింపదు. కావున, వాచ్య వాచకములకు అభేదము. దృశ్యమాన వస్తువులన్ని శబ్దములచే తెలియు చున్నవి, ఈ శబ్దాలన్నీ ఓంకారంలోంచి పుట్టినవే, కావున ఓంకార స్వరూపాలే.

ప్రపంచమంతా ఓంకారం. త్రికాలాతీతమగు అవ్యక్తముకూడ ఓంకారశబ్దవాచ్యమే. వాచ్యమయేదంతా ఓంకార స్వరూపమే. ఇదంతా పరబ్రహ్మమే. ఈ ఆత్మకూడ బ్రహ్మమే. ఈ ఆత్మకు నాలుగుపాద ములు గలవు అవి విశ్వ, తైజస, ప్రాజ్ఞ తురీయములనునవి. ఈ నాలుగు పాదములుగల ఆత్మయే పరబ్రహ్మ. [అయమాత్మాబ్రహ్మ]. ఆత్మ - అనగా సర్వత్ర వ్యాపించిన దివ్యామృతము యొక్క జ్ఞానా మృతమే. అనేక దేహములుచూచి, అనేక ఆత్మలున్నవను భ్రాంతి కల్గు చున్నది. ఇది మిథ్యా కల్పితము. ఒక ఇంటిలో గదులెన్నియున్నను, వాటిలోని గాలి యొక్కటే. ఓంకార మొక్కటే సర్వవ్యాపి. ఈఆత్మయే ప్రతివ్యక్తిలో నున్న "నేను" - "నేను" అనునది. అందరిలోని "నేను" ఒక్కటే. మనలోని ఆత్మయే బ్రహ్మ. [అయం ఆత్మాబ్రహ్మ]. ఆత్మ వేరు పరమాత్మవేరు కాదు. "అదే ఇది" అను జ్ఞానామృతముచే అన్ని ఆలోచనలు నశించి, శాశ్వతబ్రహ్మనంద ప్రాప్తి కల్గును. దీనికి కారణము ఆత్మజ్యోతియే.

## ఆత్మకుగల సోపానములు - వివరణ

ఓంకార స్వరూపము మహాదుర్లభమైనది. విశ్వ రూపమే ఓంకార స్వరూపము. ఇది దేవతలు సహితం దర్శించే సుదర్శన స్వరూపం. ఈ ఓంకార దర్శనమే సుదర్శనం, భగవద్దర్శనం ఈ దర్శనము అనన్య భక్తిచే మాత్రమే లభ్యమగును. దైవసంబంధములయిన పూజ, ధ్యాన, జపాదికర్మలను భగవదర్పిత బుద్ధితో చేయువాడు [కర్మ యోగము], దైవమునే పరమ పురుషార్థముగ నమ్మి దైవతత్పరుడై యున్నవాడు [ధ్యానయోగము], బ్రహ్మానందప్రదుడగు భగవంతుని యందే అతిశయభక్తి గలవాడు, దేహాది దృశ్య పదార్థముల యందు ఆసక్తి వదలినవాడు (జ్ఞానయోగము), సర్వభూతదయగలవాడు. పరమాత్మ సాయుజ్యము ఈ జన్మయందే పొందగలడు. సాధకులిందలి రహస్యమును గుర్తించి, చింతించినచో వారి యత్నము సార్థకమగును దీని సాధనకు ఎవరైనా అర్హులే, ఎవరైనను పైగుణములు గల్గియుండి అనగా యోగ్యతకల్గియుండి సాధించవలెను. సరియైన ఔషధము ఏ రోగి త్రాగిననూ నయమగును కదా! ఔషధమునకు వారువీరను భేదము లేదు. కావున ప్రతి ఒక్కరూ సాధకులై భగవత్ప్రాప్తిని పొందవలెను.

మనస్సును పరమాత్మయందు నిలుపుట. నిరంతరము దైవ చింతనాపరులై యుండుట, మిక్కిలి శ్రద్ధతో కూడికొని యుండుట. అను ఈ మూడు అర్హతలున్నవాడే గమ్యము చేరగలడు. రైలు గమ్యస్థానము చేరవలెనన్న పట్టాలు రెండూ సమాంతరముగా ఉండవలెను. బండి రెండు పట్టాలలో ఏది లోపించినా గమ్యంచేరలేదు. అట్లే మనంగమ్యంచేరాలంటే ఏకాగ్రత అనే రైలు, భక్తి శ్రద్ధలనే పట్టాలున్ననాడే సాధ్యం కాగలదు. రైలుపై ఎవరెక్కినా గమ్యం చేరునట్లు, యోగులైనా, సగుణోపాసకులైనా, నిర్గుణోపాసకులైనా, సన్యాసులైనా, గృహస్థులైనా, ఎవరైనా సరే భక్తి

శ్రద్ధలు ఏకాగ్రతకల్గి అక్షరపరబ్రహ్మను ధ్యానించి కర్మఫల త్యాగం చేస్తారో వారు వెంటనే ఉద్ధరింపబడుదురు.

వివేకములేని అభ్యాసము కంటెను, శాస్త్రజన్యజ్ఞానము కంటె ధ్యానం గొప్పది. ధ్యానం కన్న కర్మఫల త్యాగము శ్రేష్ఠము. త్యాగము వలన శాంతి లభించును. ఉప్పొంగనివాడు, ద్వేషింపనివాడు, శోకము పొందనివాడు, శుభాశుభ పరిత్యాగియే దైవభక్తుడు. చిత్తమనే పుష్పాన్ని విశ్వనాథుని కర్పించినవాడే వివేకవంతుడు. శత్రుమిత్రులందు సమత్వము మానావమానములందు సమభావము. శీతోష్ణములందు సమత్వము, సుఖదుఃఖములందు సమభావము, నిందాస్తుతులందు సమత్వం, మౌనము, దొరికిన దానితో సంతుష్టి, స్థిరబుద్ధి, భగవద్భక్తి మొదలగు సుగుణములు గలవాడే భగవంతునకు ప్రీతిపాత్రుడు. ఈ రీతిగా శ్రద్ధావంతులై ఓంకార ధ్యానమందే ఆసక్తిగలవారికి దివ్యామృత ఫలము లభించును.

ద్వితీయ పాదము తైజసుడు. ఇతని కర్మక్షేత్రము స్వప్నావస్థ. ఈ జీవుడు తేజోమాత్రుడై స్వప్నమందు విషయవాసనలు గ్రహించుట చేత స్వప్నము ఇతనికి స్థానము. జాగ్రద్వాసనలు అంతః ప్రకాశముచే ఉజ్జ్వలితములై స్వప్నములో యదార్థముగా భాసించి అనుభవిస్తున్నాడు. స్వప్నానుభవాలు మానసికములు కావున జీవుడు అంతఃప్రజ్ఞుడు. మానసిక వాసనలు జీవుని తేజస్సుచే ఉద్దీప్తములై అతనిచే అనుభవించడం చేత అతడు తైజసుడనిరి. స్వప్నకాలములో కూడ ఇతనికి సప్తాంగములు, 19 ముఖములు గలవు. విశ్వతైజసులిద్దరు మనస్సులోని ఆత్మతత్త్వము యొక్క అంశలు.

మూడవ పాదము ప్రాజ్ఞుడు. ఇది సుషుప్త్యవస్థ. మానవుడు ఈ సుషుప్త్యవస్థలో గాఢనిద్ర చెందినపుడు కోరికలేమీ ఉండవు, స్వప్న

ములు రావు. ఈ అవస్థలో జాగ్రత్, స్వప్న విషయముల యొక్క మనో ప్రవృత్తులన్ని ఘనీభూతములగును. ఆ స్థితిలో అతను ప్రజ్ఞాన ఘన మాత్రుడు. ఆనందస్వరూపుడై - ఆనందము పొందును నిద్రించువాడు ఎచట ఎట్టి కోరికలను కోరడో. ఎచట స్వప్నము కూడ చూడడో అదే సుషుప్త్యవస్థ - అని శ్రుతి.

"యత్రసుప్తోన కంచన కామంకామయ యతే నకంచన స్వప్నం పశ్యతి తత్సుషుప్తం।"

That state is deep where the sleeper does not desire any enjoyable thing and does not see any dream.]

సుప్తావస్థలోని జీవుని ప్రాజ్ఞుడందురు. ప్రాజ్ఞుడే బ్రహ్మయొక్క తృతీయపాదము. ఈతడే సర్వేశ్వరుడు. సర్వజ్ఞుడు. సర్వాంతర్యామి. సమస్తమునకు మూలకారణము ఇందుండియే సమస్తము ఉద్భవించి యిందే సమస్తము లీనమగుచున్నది.

[Prajna is the third quarter : This one is the lord of all; this one is Omniscient; this one is the inner Director of all; this one is the source of all; this one is verity the place origin and dissolution of all beeings"]

ఈ సుప్తావస్థను గూర్చి ప్రాచ్య పాశ్చాత్య మనస్తత్వ శాస్త్రజ్ఞులు పలురకములైన పరిశోధనలు సల్పుచున్నారు. మహర్షులు దీనిని పరిశోధించి విపులీకరించి యున్నారు. సుషుప్తిలో మనోబుద్ధులు విశ్రాంతి తీసికొంటాయి. కావున ఇంద్రియాలు పనిచేయలేవు. కావున సుషుప్తిలో పూర్తిగ అజ్ఞానమే ఉంటుంది సుషుప్తిలో ఏ జ్ఞానము ఉండదు. అచట విషయవాసనలుండవు. స్వప్నధర్మముండదు. కావున అది జాగ్రత్, స్వప్నములేని అవస్థ. ఇంతకుముందు గల ప్రజ్ఞానము సుషుప్తిలో ఘనీ

భూతమైనట్లు తోచును ఆ స్థితిలో చైతన్యము ప్రజ్ఞాన ఘనరూపములో నుండును. ఇట్టిది ఆనందమయము ఈ ఆనందమయమునకు అర్థము వేరు. "మనోబాధలు కలిగించు కారణములేని స్థితి," యే ఈ ఆనందమున కర్థము ఈ సుషుప్త్యవస్థ ఆత్మజ్ఞానమునకు సింహద్వారం లాంటిది. తర్వాత స్థితి ఆత్మజ్ఞానము.

ఆత్మ అంతఃప్రజ్ఞము కాదు బహిఃప్రజ్ఞము కాదు. ఉభయతః ప్రజ్ఞ కలదికాదు. ప్రజ్ఞానఘనముకాదు ప్రజ్ఞ కాదు. అప్రజ్ఞము కాదు. అది అదృష్టము అవ్యవహార్యము. అగ్రాహ్యము. అలక్షణము, అచింత్యము. అవ్యపదేశ్యము ఏకాత్మ ప్రత్యయసారము ప్రపంచోపశమము శాంతము శివము అద్వైతము అదియే చతుర్థపాదమని తలంచుచున్నారు. అదే ఆత్మ. దీనినే తెలిసికొనవలెను.

పరమాత్మను ప్రదర్శించుటకు, విషయములను తదనుభవములను "నేతి, నేతి" అని నిరాకరించు టొక్కటే మార్గము. ఒకడు రాత్రి సమయములో త్రాడు త్రొక్కి పామని భ్రమపడెను. పాము త్రొక్కుట వలన కలిగి భయమును, చెమటపట్టుట, ఆందోళన ఇత్యాదులు కలుగును వాని భయాదులు బాపుటకు సత్యమైన త్రాడని చెప్పుటకు "కాదు కాదని, వాదముచే నిరూపించెదము. అది కర్ర కాదు, పుల్లకాదు, సర్పముకాదు- అని చెప్పెదము. అట్లే ఇందు చెప్పబడినది. ఈ తురీయావస్థలో ఆకార మేదియు లేదు బాహ్యేంద్రియములకు, జ్ఞానేంద్రియములకు కూడ గోచరము కానిది. అన్నివ్యవహారములు జరుగుటకు నిలయము, గ్రహింప శక్యము కానిది. లక్షణము లేనిది, చింతింపశక్యము కానిది, వర్ణింప శక్యము కానిది, ఒకే ఒక శుద్ధ చైతన్యరూప ఆత్మసారము. జాగ్రదాది ప్రపంచరహితుడు, శాంతస్వరూపుడు, కళ్యాణరూపుడు, ఏకమైనది [ద్వితీయం లేనిది] అగు ఆ తురీయావస్థయే-ఆత్మ. దీనిని తెలిసికొనాలి. వినుటచే ఎరుగవలెను. ధ్యానం చేయాలి మననం చేయాలి, నిధి

ధ్యాస నభ్యసించాలి జగత్ సృష్టి దేవుని యొక్క స్వభావమే. సృష్టి స్వప్న సదృశము - అని ప్రముఖులనిరి. నిత్య సత్య సర్వవ్యాపి శుద్ధ చైతన్యమే మనమని తెలిసికోవాలి. ప్రాజ్ఞునకు సత్యంగాని, అసత్యంగాని, ఆత్మగాని, అనాత్మగాని తెలియదు. తురీయమునకు సమస్త ప్రపంచము తెలియును.

ప్రాజ్ఞుడు సత్యంగాని, మిథ్యగాని, మంచినిగాని, చెడునుగాని, ఆత్మనుగాని అనాత్మనుగాని తెలిసికోలేడు. సుషుప్తి అవస్థలో - శుద్ధ చైతన్యం రూపంకాదు, సర్వ సంపూర్ణమైనదికాదు. మనము అజ్ఞానములో సుషుప్త్యావస్థ పొందుచున్నాము. సుషుప్తి అవస్థలో వానికేమియు తెలియదు. తురీయావస్థలో అన్నియు తెలియునని భావించును. శుద్ధజ్ఞాన స్వరూపమే - తురీయము.

వెలిగే దీపాన్ని వెలిగించడానికి ఇంకొక దీపం అక్కర్లేదు. అట్లే జ్ఞాన రూపమైన ఆత్మను తెలిసికోవటానికి ఇంకో జ్ఞానం అక్కర్లేదు. అద్వైత స్వరూపమైన ఆత్మయే సత్యము. ధ్యానం ద్వారా పరమాత్మను తెలిసికొన్న తర్వాత ద్వైతభావం ఉండదు. ద్వైతనిమిత్తమైన భేదం నశించుటచే ఆత్మ సాక్షాత్కారము కల్గును.

ఓంకార, పరబ్రహ్మాత్మలకు అభేదము కలదు. తురీయుడగు ఆత్మ ఓంకార అక్షరముచే వర్ణింపబడుచున్నాడు.

ఓంకారములో అకార, ఉకార, మకారములు తురీయమైన అ మాత్ర స్వరూపము కలసి నాలుగు మాత్రలు కలవు.

జాగ్రదవస్థయే స్థానంగాగల వైశ్వానరుడు - ఓంకారములోని మొదటిదియగు "అ'కారము. ఈ రెండింటికి అభేదము నెరిగినవాడు సమస్త కోరికల్ని పొందుచు గొప్పవారిలో ప్రథముడగును. భావనప్రధానము. శిలను శివునిగా భావించివను, శిలువను క్రైస్తవులు క్రీస్తుగా

భావించినను, వారు ఒకవిధమైన దివ్యానుభూతి పొందెదరు. కనుక ఏకాగ్రత కుదురుటకై ఒక ఆధారము ధ్యానమునకు కావలెను. కావున శ్రుతి "ఓం" ధ్వనిని ధ్యానించు విధానము చెప్పుచున్నది. ఇస్లాం మతస్థులకు కూడ మూర్తి లేదు ధ్వనినే ధ్యానింతురు. "అ" అందే సర్వశబ్దములు. సమస్తము వ్యాప్తమై ఉన్నది. "అ" సర్వవ్యాపి ఈ రహస్యము తెలిసికొనవలెను కావున "అ" అంతరార్థము తెలిసికొని ధ్యానించాలి. ఇస్లాం మతస్థులు కూడ "అల్లా"........అని "అ" కారముతోనే ప్రారంభించి ప్రార్థింతురు. స్వప్నావస్థాభిమాని తైజసుడు "ఓం".... కారములోని రెండవ అక్షరమగు "ఉ"కారము. ఉత్కృష్ట, మధ్య నుండుట అనునవి సామ్యగుణములు ఇది తెలిసినవాడు ఉత్తమజ్ఞాని. ఇతనిని అందరు గౌరవింతురు. వీని వంశములో బ్రహ్మజ్ఞాని పుట్టును. అకార, మకారములకు మధ్యగలది ఉకారము. జాగ్రత్-సుషుప్తులకు మధ్యగలది స్వప్నావస్థ ఇది ధ్యానించుటచే జ్ఞానవృద్ధి కల్గును. మంచిసంతానము, అధ్యాత్మిక జ్ఞానము కలుగును. "మ"కారములో సుషుప్తియే స్థానంగా గల ప్రాజ్ఞుడు ఐక్యం పొందును. ఇందు జాగ్రత్ స్వప్నము లీనమగును. ఏకాంత స్థితిలో అద్వితీయ జ్ఞానోదయము కల్గును. జగత్తు యొక్క యథార్థస్థితి తెలిసి జగత్కారణాత్మభావము పొందును. పాదత్రయమునకు తరువాత తురీయపాదమునకు అమాత్రస్వరూపమునకు భేదము చెప్పబడెను. ఓంకారము తురీయమగు ఆత్మయే.

ఓంకారము పూర్తిగా ఉచ్చరించిన పిమ్మట మరొక ఓంకారముచ్చరించులోపుగాగల మాత్రారహితమైన మౌనమే ఈ ఆత్మస్థితి. ఇదే పరమాత్మ అనుగ్రహము. మాత్రారహితమై, అవ్యవహార్యమై, ప్రపంచోపశమము కల్గి, శివమై అద్వైతమైన ఓంకారమే చతుర్థము. అదియే ఆత్మ దీనిని తెలిసికొనినవాడు పరమాత్మలో లీనమగును. జీవాత్మ పరమాత్మతో ఐక్యము చెందును. మాత్రారహితమైన నిశ్శబ్ద ఓంకారముపై ధ్యానించు

వానికి ద్వైతభావము తొలగి, దివ్యానుభూతి కల్గును పరమాత్మ స్వరూపు డగును అదే "ఓమ్" అదే పరబ్రహ్మ.

అపూర్వము :-

ఓం-కారము అపూర్వము - ముందులేనిది. అనగా ఓంకారమే మొదటిది. ఓంకారమనగా ప్రపరబ్రహ్మ. బ్రహ్మ-నిష్కారణుడు, అజుడు అమృతుడు, అవికారుడు. కావున దీనినుండియే వేదములు, యజ్ఞములు సృష్టి సమస్తము నిర్మింపబడెను.

## -: సృష్టి :-

సృష్టికి మూలకారణము :-

ఓంకారమే బ్రహ్మ, సత్యం, జ్ఞానం, అనంతమైనది బ్రహ్మ. సత్యం అంటే భూత భవిష్యత్ వర్తమానములలో మార్పులేక నిత్యముగా ఉండేది. జ్ఞానస్వరూపము, ఆత్మస్వరూపము, ఈ రీతిగా ఆత్మయే పర మాత్మ అని పరబ్రహ్మ స్వరూపము తెలిసికొనిన జ్ఞాని పరబ్రహ్మమునే పొందును. ఈ ఆత్మయే మొదటిది. దీనికి ముందేదియులేదు. దీనినుండి యే సమస్తము పుట్టెను. ఆత్మగా వ్యక్తమగుచున్న పరబ్రహ్మనుండి శబ్దమే గుణముగా సమస్త భూతములకు అవకాశమిచ్చు ఆకాశము పుట్టెను. ఆకాశము నుండి శబ్దస్పర్శలను రెండు గుణములు గల వాయువు పుట్టెను.

వాయువునుండి శబ్ద స్పర్శ రూపములుగల త్రిగుణాత్మకమైన అగ్ని పుట్టెను. అగ్ని వలన నీరు పుట్టెను. ఇందు శబ్దస్పర్శ రూప రసములను నాలుగు గుణములు గలవు. నీటి నుండి భూమి పుట్టినది. ఇందు అయి దవ గుణముగా గంధము గలదు. భూమినుండి సమస్త ఓషధులు పుట్టి

నవి. వానిలో నుండి అన్నము, అన్నమునుండి పురుషుడు పుట్టెను. ఆ పురుషుడే అన్నరస స్వరూపుడు. ఈ మానవునకు సర్వావయవములలో ప్రసిద్ధమైనది శిరస్సు, దేహమధ్య భాగమే ఆత్మ. అన్నమువలననే ప్రజలు స్థావరజంగమాదులన్నీ పుట్టు చున్నవి. అన్నం వలననే జీవించుచున్నవి. లయించు చున్నవి. తినబడే ప్రతిపదార్థము అన్నమే. కావున సత్త్వ బుద్ధి కలగాలంటే సాత్త్వికాహారం తీసికోవాలి. సాత్త్విక ఆహారం సత్త్వ గుణానికి కారణము. సత్త్వబుద్ధి వలననే శాంతి కల్గుతుంది. శాంతి వలన ధ్యానము కల్గును. ధ్యానము వలన జ్ఞానము, జ్ఞానము వలన మోక్షము ప్రాప్తించును. సత్త్వగుణము జ్ఞానాసక్తిని పెంచును. మోక్ష ప్రాప్తికి జ్ఞానము కావలెను. జ్ఞానము కలుగవలెనన్న సత్త్వగుణము, సత్త్వబుద్ధి కల్గుటకు సాత్త్వికాహారము కావలెను. అందుచే సత్త్వ ప్రధానుడు రజోగుణ, తమోగుణ ఆహారములను వదలి, సాత్త్వికాహార మును తీసికొనవలెను.

'సత్త్వాత్సం జాయతే జ్ఞానం' అన్న బ్రహ్మోపాసన వలన సర్వ సుఖములు కల్గును.

ఈ రీతిగా సృష్టి సమస్తము ఆత్మనుండియే పుట్టెను. కావున ముందుగా గలది ఆత్మయే. అదే ఓంకారము. ఓంకారము-అనంతరము =దానికంటె మరొకటి వేరేలేనిది. ఉన్నది - ఒక్క ఓంకార బ్రహ్మమే ఆ పరబ్రహ్మ సర్వవ్యాపి అగుటచే తద్భిన్నముగా ఇతరమైనది ఏదీ లేదు.

## ఓంకార బ్రహ్మకు గల పేర్లు :—

పరబ్రహ్మనామ రూపరహితమైనను, భక్తులు ధ్యానించుటకై వానికి నామములు చెప్పబడెను. అవియే ఓం, తత్, సత్.

1. ఓమ్ అనగా పరబ్రహ్మము. తత్ - అపరబ్రహ్మ. సత్-స్వ
స్వరూపమైనది.

2. తత్ = అ. సత్-స్వరూపమైనది. ఓమ్ = పరబ్రహ్మము.

కనబడు ప్రపంచమంతా మిథ్యావస్తువు [బ్రహ్మ సత్యం, జగన్మిథ్యా] బ్రహ్మమే సత్యము. కావున దానికంటె వేరొకటి లేదు. ఉన్నది ఒక్క ఓంకారమే.

ఓంకారముకంటె భిన్నమైనది. ఓంకారము [ఆత్మ] కాక వేరొకటి ఆ బ్రహ్మయందు లేదు. ఆత్మ వ్యయము కాదు - కనుక ఆత్మ అవ్యయము. ఈ రీతిగా తెలిసి కొనుటయే ఆత్మసాక్షాత్కారము చేసి కొనుట. ఆత్మానందమే బ్రహ్మానందము.

శ్లో॥ సర్వస్య ప్రణవోహ్యాదిర్మధ్య మన్త స్తథైవచ,
ఏవంహి ప్రణవం జ్ఞాత్వా వ్యశ్నుతే తదనన్త రమ్॥ గీత 11-8.

ఆది, మధ్య, అంతములగుచున్నది - ఓంకారమే. ఈ రీతిగా ఓంకారమును తెలిసికొనినవాడు వెంటనే బ్రహ్మ అగును.

బ్రహ్మ తెలియనంతకాలము, అనగా ఆత్మజ్ఞానము లేనంత కాలము, అజ్ఞానియై దృశ్య ప్రపంచము శాశ్వతమని నమ్మును. ఈ అజ్ఞానాంధకారము తొలగవలెనన్న జ్ఞానమొక్కటియే మార్గము. మానవునిలో నున్న అజ్ఞానమను చీకటి ఉన్నది. ఈ చీకటి తొలగిననగాని ఆత్మ అనే వస్తువు కనబడదు. మనకున్న ఈ నేత్రముల వలన ఆ ఆత్మను కనుగొనలేము. దివ్యనేత్రములు ఉన్ననే కనుగొనగలము. కావుననే అర్జునునకు దివ్యదృష్టి ప్రసాదించెను. "ఈ నీమాంసమయ నేత్రములతో విశ్వరూపమును చూడజాలవు. కావున దివ్యదృష్టిని (జ్ఞాననేత్రము) ప్రసాదించుచున్నాను. దానిచే దర్శింపుము.

శ్లో॥ న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా,
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్"

ఈ రీతిగా జ్ఞాననేత్రము చేతనే మాయ అనే చీకటి తొలగి, సత్యము, కన్పించును. కావున సత్యమైన ఆత్మను చూడవలెనన్న జ్ఞాన మొక్కటియే మార్గము [జ్ఞానాదేవతు కైవల్యమ్]. ఆ రీతిగా జ్ఞానము కల్గిన తర్వాత మోక్షము కల్గును. అదియే ఆత్మదర్శనము. అదే ఓంకార దర్శనము. ఈ ఓంకారమును తెలిసినవాడే బ్రహ్మ. మొదట నున్నది; మధ్యనున్నది; అంతమందున్నది, కాలస్వరూపము, సర్వమూ ఓంకారమే కావున ఓంకారమును తెలియుటయే పరమపురుషార్థము. ఆదిమధ్యాన్త రూపమైన ఈ జీవనలీలలకు ఓంకారమే ఆధారమని తెలిసికొనినవాడే బ్రహ్మవేత్త. బ్రహ్మవేత్త బ్రహ్మానందమును పొందును.

[ఓం బ్రహ్మవిదాప్నోతి పరమ్].

సర్వశక్తి సంపన్నుడైన భూపతికిగల ఆనందము మనుష్యానందము. ఇట్టి చక్రవర్తి ఆనందమునకు ఒకటి ప్రక్కన ఇరవైసున్నాలు చేర్చినన్ని రెట్లు చెప్పబడిన ఆనందము - బ్రహ్మానందము. ఇంతటి మహత్తర బ్రహ్మానందము, బ్రహ్మవేత్త పొందును. ఇట్టి బ్రహ్మవేత్తయే "ఓం"కారమును పూర్తిగ తెలిసినవాడు. కావున పరిపూర్ణముగ తెలిసికొన తగినది ఒక్కటే ఒక్కటి. అదే "ఓమ్".

ఈ ఓంకారము బ్రహ్మస్వరూపమని, శ్రేష్ఠమైనదని తెలిసికొన వలెను. ఆ రీతిగ తెలిసికొని ఎవడు దేనినికోరి ఉపాసించిన, అది వానికి సిద్ధించును.

ఈ పరబ్రహ్మరూపము శ్రేష్ఠమైన బ్రహ్మప్రాప్తి సాధనమైన ఓంకారమని తెలిసికొన్నవాడు బ్రహ్మలోకమందు పూజింపబడును.

విశ్వనాథుడు ఎందరికో ఓంకారము నుపదేశించెను. దానిని మృగశృంగమహాముని భార్యలైన - సువృత, కమల, విమల, సురస లను వారందరు దానిని ధ్యానించి ముక్తులైరి. ఆ ఓంకార దివ్య తారక నామామృతముచేతనే వారందరు ముక్తులైరి. ఈ రీతిగ ముక్తికి కారణము "ఓం"కారము. అట్టి ఓంకార స్వరూపము తెలిసికొనుటయే జ్ఞాని లక్షణము. ఏ మానవుడైనను ఓంకారార్థము తెలిసికొనుటచే, దాని యందు శ్రద్ధ కల్గును. శ్రద్ధగల్గుటచే భక్తి ఏర్పడి జ్ఞానవంతుడగును. జ్ఞానమే అజ్ఞానము తొలగుటకు మార్గము. కావున ఓంకార స్వరూపము వివరించెదను పఠించి ఆచరించి ఆనందింపుడు.

## ఓంకారము—నామాంతరములు :—

'ఓం' దీనిని ఓంకారమనియు, ప్రణవమనియు, ఉద్గీథమనియు, ఏకాక్షరమనియు, తారకమనియు, శబ్దబ్రహ్మమనియు, ఆత్మ, పరబ్రహ్మ, పరమాత్మ, సర్వవ్యాపి అని అందురు. ఇవన్నీ నామాంతరములు. పరబ్రహ్మకుగల సర్వనామములు - ఓం - కారమందంతర్గతములు. ఓంకారార్థమే వాటన్నిటి యందున్నది.

"ఓం, ఖం, బ్రహ్మ"— అని యజుర్వేదమందు కలదు.

అన్నిటికంటె గొప్పదనముచేత "బ్రహ్మ" అనిరి.

[సర్వేభ్యోబృహత్వాత్ - బ్రహ్మ]

ఈ రీతిగా సర్వభూతములను రక్షించు ప్రణవార్థమిది. అన్నిటికన్న గొప్పది, అంతట వ్యాపించినది, సేవించినవారిని రక్షించునది - ఒక్క "ఓం"కారమే, కావున ఓంకారము సర్వవ్యాపకుడయిన పరబ్రహ్మ స్వరూపము.

ఓంకారము సర్వవ్యాపి కావున విష్ణువని పిలువబడును. శబ్ద గమ్యుడైనవాడు గావున నారాయణుడని కూడ నామము గలదు. ఈ రీతిగ అన్ని నామములు ఓంకారాంతర్గతములే. ఉపనిషత్తులన్నియు పరబ్రహ్మస్వరూపమును వర్ణించినవి. "ఓమిత్యేకాక్షరమ్ !" ... ప్రత్యగానందం బ్రహ్మపురుషం ప్రణవస్వరూపమ్ ! అకార ఉకారమకార ఇతి ! ... కారణరూప మకారణ పరబ్రహ్మమ్ !" ఈరీతిగా నారాయణోపనిషత్తు ఓంకార స్వరూపమును వర్ణించినది. తత్ఫలితము ముక్తియని చాటినది.

## ఓంకారము - చతుర్వేదములోని మహావాక్యాలు

ఓంకారమును విపులీకరించు నాలుగు వేదములలోగల మహావాక్యములు శుకరహస్యోపనిషత్‌లో చెప్పబడెను.

"ఓం ప్రజ్ఞానంబ్రహ్మ" అని ఋగ్వేదములోను,

"ఓం అహం బ్రహ్మాఽస్మి" అని యజుర్వేదములోను,

"ఓం తత్త్వమసి" అని సామవేదములోను,

"ఓం అయమాత్మాబ్రహ్మ" - అని అథర్వణవేదములోను - పరబ్రహ్మ-ఆత్మ స్వరూపమని యున్నది. ఆత్మస్వరూపమును తెలిసికొనుటయే ఓంకార దర్శనము.

ఋగ్వేదములో గల మహావాక్యమునే ఐతరేయోపనిషత్తులో "సర్వం తత్ప్రజ్ఞానేత్రం ప్రజ్ఞానే ప్రతిష్ఠితం. ప్రజ్ఞానేత్రో లోకః ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజానం బ్రహ్మ" - అని చెప్పబడెను.

అంతటనుండు ప్రజానమునకుగల లక్షణము దేహమందున్న ప్రజానమందున్నది. కావున ఆ ప్రజానమే బ్రహ్మము.

"యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతిచ,
స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞానముదీరితమ్ ॥"

సకలేంద్రియములను తెలిసికొనెడి చైతన్యస్వరూపమే ప్రజ్ఞానము. ప్రజ్ఞానశబ్దమునకు విశేషార్థముపై శ్లోకములో తెలుపబడినది. అదే ప్రజ్ఞానము.

దేవతలందు, మనుష్యులందు, గోవులందు, ఆకాశాది భూతములందు గలదియు జగజ్జన్మాది హేతుభూతమగు అద్వితీయ చైతన్యమే బ్రహ్మ. ఆత్మయే పరమాత్మయనియే ఇందలి రహస్యము. యజుర్వేదములో గల మహావాక్యము - బృహదారణ్యకోపనిషత్తునందు [అహం బ్రహ్మాస్మి] "య ఏవం వేదాఽహం బ్రహ్మాఽస్మీతి స ఇదగ్ం సర్వంభవతి" అని చెప్పబడెను. "నేను బ్రహ్మమగుచున్నానని" ఈ వాక్యార్థము. ఇచట జీవబ్రహ్మైక్యము ప్రతిపాదింపబడినది. నేను [ఆత్మ] బ్రహ్మమగుచున్నాను. బ్రహ్మమే ఓంకారము. కావున ఆత్మస్వరూపము ఓంకారము.

సామవేదములో గల మహావాక్యము - ఛాందోగ్యోపనిషత్తులో "ఏతదాత్మ్యమిదగ్ సర్వం తత్సత్యగ్ స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి" - అని చెప్పబడెను.

ఆ పరమాత్మయే ఆత్మ-అను జీవబ్రహ్మైక్యమే ఇచట ప్రతిపాదితము. ఇదే తత్త్వం. "ఓం తత్వమసి" - అనుటచే ఆ పరబ్రహ్మ ఓంకారమే - అని ఇందలి రహస్యము.

అథర్వణ వేదములో గల మహావాక్యము - "మాండూక్యోపనిషత్తులో" - "సర్వం హ్యేతద్బ్రహ్మాఽయ మాత్మా బ్రహ్మసోఽయ మాత్మా చతుష్పాత్" అని చెప్పబడెను.

"ఓం అయమాత్మా బ్రహ్మ" - ఈ ఆత్మయే బ్రహ్మ. అదే ఓం.

ఆత్మ స్వప్రకాశముగలది. ఇది ప్రత్యగాత్మ. అహంకారాది ఘనోదేహ సంఘాత రూపప్రపంచంలో ఆధారత్వ సాక్షిత్వములచే వర్తించడం కారణంగా ప్రత్యగాత్మ అంటారు [అహంకారాది దేహంతాత్రృత్య గాత్మేతిగేయతే] సృష్టికారకుడు, సచ్చిదానందస్వరూపుడు బ్రహ్మ. ఈ ఆత్మయే బ్రహ్మ" అని తెలియుచున్నది.

నేను, నాది అనునవిలేవు అంతా నేనే. నేనే అనునది తెలియాలంటే సద్గురువులవలన ఈ మహావాక్యార్థాలు శ్రద్ధగా వినాలి. విన్న వాటిని మననం చేయాలి. మననం చేసిన వాక్యార్థాల్ని మాటిమాటికి తలంచాలి. ఈ రీతిగ చేసిన పూర్ణబోధ కల్గును.

ఈ ప్రపంచమంతా బ్రహ్మమే. ప్రత్యగాత్మ బ్రహ్మమే - అని శ్రుతి. శుక్తినిచూచి రజతమని భ్రాంతి పొందెదరు. శుక్తిని శుక్తిగాకాక, రజతముగా తలంచునట్లు జీవునికంటె వేరుగా ఈ ప్రపంచమును తలచుచున్నాము. రజతము నిజముగా అచట లేనట్లు ఈ ప్రపంచమును లేదు. కాని శుక్తి రజతభ్రాంతివోలె ఆత్మకంటె బ్రహ్మ అన్యమని తలంచుట అజ్ఞానముచేతనే. జ్ఞానికి ఆత్మయే బ్రహ్మ. జ్ఞాని సర్వేసర్వత్ర బ్రహ్మ పదార్థమునే చూచును.

కావున పై విషయమంతయు వేదవేదాంతసారము, బ్రహ్మ రహస్యము. ఈ మహావాక్యమువలన కల్గిన జ్ఞానసిద్ధి నిరంతరము ఉండవలెననునది ఈ క్రింది ఆశీర్వాదము.

"యతసర్వత్రా వస్థితం ప్రజ్ఞానం బ్రహ్మఽతో మయ్యేవస్థితం ప్రజానం బ్రహ్మైవ ప్రజానత్వా విశేషాదిత్యైతరేయ మహావాక్యోక్త జీవ బ్రహ్మైక్య పానసిద్ధిర్నిరంతరం భూయాత్" ॥

"సర్వాణ్యేతాని ప్రజ్ఞానస్య నామధేయాని భవంతేతి వాక్యేన దేహింద్రియాది సాక్షిరూపం యత్ప్రజానం త్వం పదార్థరూపం నిర్ణితం

తదేవైష బ్రహ్మేత్యా దివాక్యేన జగత్కారణ తయానిర్ణీతం పరం బ్రహ్మ నచా నయోరీషదపి భేదోఽస్తీత్యైతరేయ మహావాక్య జన్యజ్ఞానసిద్ధిర్నిరంభూయాత్".

ప్రజ్ఞానము బ్రహ్మమే. జీవబ్రహ్మైక్య జ్ఞానసిద్ధి ఈ మహా వాక్యమువలన కలిగిన జ్ఞానసిద్ధివలన నిరంతరము కల్గుగాక!

ఈ మహావాక్యముల యందలి పరమార్థమే ఓంకారదర్శనము.

శ్లో॥ ప్రణవం హీశ్వరం విద్యాత్ సర్వస్య హృది సంస్థితం ।
సర్వవ్యాపిన మోంకారం మత్వా ధీరోన శోచతి ॥

ఓంకారము - సర్వప్రాణులయొక్క హృదయములందున్న ఈశ్వరునిగా తెలిసికొనుము. 'ఓం'కారము సర్వవ్యాపిగా తెలిసికొన్నవాడు ధీరుఁడు. అట్టి ధీరుఁడు ఎన్నడును దుఃఖించడు. అన్నివేళలా ఆనందించుచుండునని అభిప్రాయము. సమస్తమైన జీవుల హృదయ కుహరములయందు ఒకేఒక జీవశక్తి కలదు. ఆ జీవశక్తిని ఓంకారము తనలో ఇముడ్చుకొన్నది.

అందరి హృదయము లందున్నట్టి సమస్త ప్రపంచమును పాలించు ప్రభువైన ఈశ్వరుడే - ఓంకారము. ఈ భావమే గీతయందును నారద భక్తి సూత్రములందును. ఉపనిషత్తులందును చెప్పబడినది. ఈ మహేశుని వేదవేదాంతములుగాని, శాస్త్రాదులుగాని తెలియపరచలేనపుడు అల్పబుద్ధిగల నేను తగుదువయ్యా అని ఇట్టి సద్గ్రంథ రచనకు పూనుకొనుట తప్పగునేమో అని కొన్ని పద్యములు రచించితిని. అవి ఇవి :-

నిగమంబులు శాస్త్రంబులు
నిగమాంతము లెన్నియేని నిను తెలుపంగా
తగమంచు పలుక యది విని
తగుదును నేననఁగ నెంత తప్పు మహేశా !!

"హరహరశంభో ! శంభో
హరహర" యని పలుక నికనిహంబని, పరమం
చరయుట నేటికి ? మోక్షమె
కరతలగతబదద ఫలముగాఁగ మహేశా !!

"దివినుండి పడిన తోయము
భువిసాగరు జేరునట్లుం పొందును నిన్నే
దివిజులకెవరికి చేసిన
వివిధములగు పూజలెల్లవియును, మహేశా !!

పరమేశ్వరునకు అనేక నామములున్నవి. ఏ నామము ధ్యానించినను సర్వము ఆ పరంధామమునే జేరును. సర్వనామములకు మూల నామము ఓంకారమే. ఎవరికి తోచిన నామము వారు ధ్యానించిన, మూలతత్త్వమగు పరతత్త్వమునకే జేరును. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయుటకై శ్రీ శేషసాయి ఎన్నియో అవతారములు ఎత్తుతూనే ఉంటాడు. శేషసాయి ఒక అవతారంగాను, ఒకేసారి రెండవతారాలుగాను, మరొక సారి తన ఇష్టం వచ్చినట్లుగాను అవతరించగల సమర్థుడు. ధర్మసంస్థాపనార్థమై రాముఁడవతారం ఎత్తెను. పరదార నపహరించిన పాపానికై రావణుని హతమార్చి, 'రాముడు ధర్మమూర్తి" [రామో విగ్రహవాన్ ధర్మః"] అను కీర్తిని సంపాదించెను. రాజ్యం రామరాజ్యంలా 'ఉండాలి – అనే మాట యుగయుగాల నిలిచింది. రాముడే రాముడు-కోదండరాముడు, ఏకపత్నీవ్రతుడు, అని వేనోళ్ళ కీర్తించారు. అనేక రక్కసులను హతమార్చి, అన్యాయాన్ని అరికట్టి, వారధి కట్టి, లంకను ముట్టి, రావణుని తుదముట్టించిన కీర్తి రామునికే దక్కింది. ఆ శేషశాయియే ఒకేసారి రెండు రూపాలు ఒకేచోట కలిగినట్లు విచిత్రరూపం దాల్చి నరసింహ

మూర్తియై, భక్తప్రహ్లాదునీ కాపాడి, త్రిలోక కంటకుడైన హిరణ్యకశిపుని విచిత్రమైనరీతిని సంహరించినాడు. ఆహా! ఏమి ఆ రూపము ? ... ఆ శేషసాయియే ఇద్దరుగా మారి నర, నారాయణులైరి మరొకసారి మూడు రూపములు ధరించెను అర్జునుడుగా, వాసుదేవునిగా, బలదేవునిగా, అవతరించెను. ఈ మూడు రూపాలు శేషసాయివే. [పాండవానాం ధనంజయః] పాండవులలో పార్థుడను నేనే- అని వాసుదేవుడే అన్నాడు. ఇన్ని అవతారాలు ఎందులకు ? ధర్మము బోధించుటకు దుష్టులను శిక్షించుటకు, శిష్టులను రక్షించుటకు, సన్యాసులను సంరక్షించుటకు ఓంకారపరబ్రహ్మ స్వరూపమయిన శ్రీశేషసాయియే ఇన్ని రూపాలుగా అవతరించుచున్నాడు దుష్టులను శిక్షించి, మంచివారిని కాపాడిన అవతారం - వాసుదేవతారం - అదే సాయిరూపం వారే ఆనందసాయి, ప్రేమామయి-శ్రీసాయి. రాజ్యాన్ని చక్కగా పరిపాలించి, ప్రజలకు సర్వసుఖాల్ని కలిగేలాచేసి, విశ్వకల్యాణం జరిపించిన అవతారం - రామావతారం. విశాలవిశ్వంలో విశ్వకల్యాణం జరిపించి రామరాజ్యంలా చేయాలని, మంచివారికి మార్గం చూపి వారికి జ్ఞానజ్యోతి ప్రకాశించాలని - శేషసాయికి కోరిక కలిగింది. ఆనాటి రామావతారం, తర్వాత వాసుదేవావతారం కలిసి ఒకేసారి అవతరించాలని శేషసాయి-సాయిరామ్ గా సాక్షాత్కరించారు రామరాజ్యంలో జ్యోతిని ప్రసాదించి, సాయిరామ్ - ఓంకారస్వరూపమేయని సెలవిచ్చారు. కావుననే, "ఓం సాయిరామ్" అని ముక్తకంఠంతో ధ్యానిస్తున్నారు.

ఓం = ఓంకారమే సాయిరామ్: సాయిరామమే ఓంకార స్వరూపము. ఇందు తత్త్వమున్నది. తత్, త్వమ్ అనినవా! తత్ = ఆసాయి, త్వమ్ = నీవే, అంటే (రామ్) ఆత్మారాముడివే. ఆ శేషసాయి నీవే - అనగా ఆ పరబ్రహ్మ ఆత్మయే సుమా! ఇదే "సోఽహం" రహస్యము. "ఓం అయమాత్మా బ్రహ్మ" - అను అథర్వ వేదమంత్ర మందలి మహా వాక్యమునకర్థము ఇదియే. "ఓం తత్త్వమసి" - అను

సామవేద మంత్రమండలి మహా వాక్యమునకర్థము ఇదియే. ఇందొక్క రహస్యమున్నది. "తత్త్వము ఓం" - తత్, త్వమ్ - ఓమ్. ఓమ్, తత్ - త్వం. "ఓంకారమే ఆత్మ" కావున సాయిరాం - ఓం స్వరూపమే. ఇది తెలియుటకే "ఓమ్ సాయిరామ్" అని ధ్యానము చేయుదురు. ఈ రీతిగ అర్థము చేసికొని ధ్యానించువారె ధన్యులు.

ఈశ్వరుడు ప్రణవ స్వరూపుడు. అతడే పరబ్రహ్మ స్వరూపుడు ఐశ్వర్యయుక్తుడె ఈశ్వరుడు. అతడే ప్రణవ [ఓంకార] స్వరూపుడు. ఇచట బ్రహ్మశబ్దమునకు సృష్టికర్త బ్రహ్మకాదు. సృష్టికర్తకే సృజించుటకు శక్తిని ప్రసాదించిన పరబ్రహ్మ అనియే అర్థము. సృష్టి స్థితిలయ కారకులైన బ్రహ్మవిష్ణుమహేశ్వరులు పరబ్రహ్మ, ఆజ్ఞ వలన వారివారి ధర్మములను నెరవేర్చుచున్నారు. ఈ ధర్మములన్నియు నిష్కామతో చేయు సత్కర్మము. కోరికలేకుండా కర్మనాచరించమనియే ఆచార్యుల పరమ సిద్ధాంతము. జీవన్ముక్తులైన జనకాదులు, భగవద్రూపులైన శ్రీకృష్ణాదులు కర్మలను చేయుచున్నారు. వారే జ్ఞానులుకదా? వారు ఈ రీతిగా విద్యుక్త ధర్మములనేల ఆచరింపవలెను? అను ప్రశ్నలు వహించును.

కర్మలు ప్రతి ఒక్కరును ఆచరించవలెను. అవి ఫలాపేక్ష రహితముగ, నిష్కామముగ చేయాలి. శాస్త్రంలో చెప్పబడిన కర్మలే చేయాలి ఇట్లా చేసిన మోక్షము కల్గును. జనకుడు, అశ్వపతి, ఇక్ష్వాకువు ప్రహ్లాదుడు, అంబరీషుడు, భగీరథుడు మొదలగు చక్రవర్తులు నిష్కామ కర్మ నాచరించిరి, తరించిరి. అనేకులకు చెడ్డమార్గమునుండి మరల్చి, మంచి మార్గమున ప్రవర్తింప జేయుటకు కర్మయోగము ముఖ్యము. కావున జ్ఞానులైనను కర్మలాచరించాలి. ఉత్తములు ఏవి కర్మలు చేస్తారో వానినే మిగిలినవారు చేస్తారు ఉత్తములు చేయు కర్మలను ఇతరులు అనుసరింతురు. శ్రీకృష్ణుడు, అర్జునుడు మొదలగు జ్ఞానులెందరో కర్మల

నాచరించిరి. తామరాకుపై నీటిబిందువులవలె, ఆకర్మలు ఆజ్ఞానులకేమి అంటవు. అయినను పెద్దవారి కర్మలు (పనులు) పిన్నలకు దారిచూపునని పెద్దలేమి చేస్తారో - పిన్నలు దాన్ని అనుసరిస్తారు. కావున సత్పురుషులు జ్ఞానులుకూడా సత్కర్మలు చేయాలి. కర్మలద్వారా భక్తి, తద్వారా జ్ఞానము కల్గును పెద్దలు చేయు ప్రమాణములు, పిన్నలు గ్రహించెదరు "యథా రాజా తథా ప్రజా" - అన్నట్లుండును జనకాదులే చేశారంటే, మనంచేసి తీరాలని చెప్పవచ్చు. కావున పెద్దలు సత్కర్మలు చేయాలి. పిన్నలు వాటిని అనుసరించాలి. ఈ రీతిగా ఓంకారార్థము తెలిసికొని, ధ్యానించినవారికి ముక్తిధామము సులభము.

విశాల విశ్వమందు మానవుడొక పరమాణువు. పుట్టిన జీవికి గిట్టుట తప్పదు జీవితకాల మత్యల్పము. సృష్టి అనంతమైనది మనము ఆకాశమును చూచుచున్నాము. విశాల ఆకాశములో ఎన్నో కోట్ల నక్షత్రాలున్నాయి. అవన్నీలోకాలే. చంద్రుని చూచుచున్నాము అతడు భూమికి రెండు లక్షల ముప్పది తొమ్మిది వేల మైళ్ళ దూరములో ఉన్నాడు సూర్యుడు భూమికి తొమ్మిది కోట్ల యేబది లక్షల మైళ్ళ దూరములో ఉన్నాడు. సూర్య చంద్రులు చాలా దగ్గరలోనున్నారు. నక్షత్రములింకను చాలా దూరంలో ఉన్నాయి. ఇవి సూర్యునికంటె నూరు రెట్లు పెద్దవి. ఇవన్నీ ఏ ఆధారం లేకుండా ఆకాశంలో ఉన్నాయి ఎలా ఉన్నాయి? ఈ విషయం ఆలోచిస్తేనే మహా అద్భుతంగా ఉంది. ఈ మహా విశ్వం ఇలా ఉందంటే - దీని కర్త ఎవరో ఒకరు ఉండి ఉండాలి. ఇంతటి విశ్వాన్ని సృష్టించడానికి, అతనికెంత శక్తి ఉన్నదో మనం ఊహించినా ఊహకందనిది. ఇంతటి మహావిశ్వమును సృజించిన విశ్వమూర్తి పరమాత్మ. పైకి కనబడు మహావృక్షము, పూర్వము విత్తనములోనున్నట్టుల, ఈ విశాలవిశ్వము సృష్టికి పూర్వము బ్రహ్మలోనుండెను. ఆ పరబ్రహ్మలో నుండే విశ్వము పుట్టెను. అంత అవ్యక్తస్థితిలో నుండి వ్యక్తమైన స్థితి

లోకి వచ్చింది. ప్రళయకాలంలో మళ్ళీ అవ్యక్తస్థితి చెందుతుంది. ప్రస్తుత విశ్వముకూడ కొన్ని కోట్ల సంవత్సరములలో లయమవుతుందని పూర్వీకులు చెప్పినట్లే ఐన్‌స్టీన్ పండితుడు పల్కెను.

ఈ పృదివియందుగల చరాచర జీవరాసులలో కించిత్తయి ఈశ్వరుడు వ్యాపించెను. ప్రతి పరమాణువులోను అయునగలరు. ["ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్"]

అట్టి ఈశ్వరుడు విశ్వమునకు వెలుపలను, లోపలను వ్యాపించి యున్నాడు. నాశరహితుడైన పరమాత్మ సర్వకాల సర్వావస్థలయందును సర్వత్ర ఉన్నాడు ప్రపంచమంతా పరమాత్మమయము.

సర్వ భూతములందుగల అంతరాత్మ - పరమాత్మ జిజ్ఞాస పరులగు యోగులు తమ లోపలనే పరమాత్మను దర్శింతురు పరమాత్మ ప్రతి ప్రాణి హృదయగుహలో నున్నది. అత్యంత సమీపములోగల ఆత్మను దర్శింపలేక, ఆ ఈశ్వరుని ఆరాధించుటకని అనేకప్రాంతములు తిరుగుట వ్యర్థము. ఆ ఆత్మ అనంతమైన సత్యస్వరూపుడు. విజ్ఞానఘనుడు. అతడే సమస్తమునకు నియామకుడు సర్వజ్ఞుడు [Omniscient] సృష్టి స్థితిలయాలకు కారకుడు. శరీరము లేనివాడు. అన్ని శరీరములలో ఉన్నవాడు. సర్వవ్యాపిగా తెలిసికొన్న జ్ఞాని దుఃఖింపడు. "మహాన్తం విభుమాత్మానం, మత్వా ధీరో న శోచతి" పరమాత్మ ఆజ్ఞచేతనే - వాయువు వీచుచున్నది, సూర్యుడుదయించుచున్నాడు. అగ్ని మండుచున్నది వర్షం కురుస్తోంది మృత్యువు తన పని చేస్తోంది. బ్రహ్మవిష్ణుమహేశ్వరులే ఆ పరమాత్మ ఆజ్ఞకు లోబడి సృష్టి స్థితిలయాలు చేస్తున్నారు. కుమ్మరి వాడు కుండలు చేయునట్లు, ప్రతి నిత్యమూ బ్రహ్మ - శరీరాలనే మట్టి కుండల్ని లెక్కకుమించి సృజిస్తున్నాడు. ధర్మ స్థాపనకై నానా యోనులందు పుట్టి, నానావస్థలు అనుభవిస్తున్నవాడు విష్ణువు. శివుడెందరినో

లయ మొందించుచు స్మశానవాసియై భిక్షాటనతో కాలం గడుపుతున్నాడు. ఇవన్నీ ఆ పరమేశ్వర సంకల్పములే. ఈ సర్వమూ ఆయనే. భూమి, ఆకాశం తమతమ స్థానాల్లో ఉండటానికి కారణం - అక్షరుడైన పరమాత్మ శాసనం. కొన్ని నదులు తూర్పుగా, కొన్ని పశ్చిమంగా ప్రవహిస్తున్నాయి. నిమిషాలు, రాత్రింబవళ్ళు, మాసాలు, ఋతువులు, వత్సరాలు - ఈ రీతిగా ఇన్ని చిత్రాలు జరుగుతున్నాయి యంటే - చేయించే కర్త ఉండి ఉండాలి. ఆయనను ఎవరూ అతిక్రమించలేరు. ఆయనే పరబ్రహ్మ ఆయన తేజస్స్వరూపుడు. మనకు కనిపించు సూర్య చంద్రాదులకు ప్రకాశించు శక్తిని ప్రసాదించిన తేజోమూర్తి ఈశుడే. ఈశ్వరుడే శోత్రమును శోత్రము. మనస్సునకు మనస్సు వాక్కునకు వాక్కు. ప్రాణానికి ప్రాణం, కనులకు కన్ను - అని తెలిసికొన్న జ్ఞానికి, దివ్యామృతము లభించును. ఏది కన్నుల - కనబడదో దేనివలన కన్నులు చూచుచున్నవో అదే పరబ్రహ్మ అని తెలిసికో. "యచ్చక్షుషా నపశ్యతి, యేన చక్షూంసి పశ్యతి, తదేవ బ్రహ్మత్వం విద్ధి" అదే ప్రాణానికి శరీరానికి ప్రభువు. ["ప్రాణ శరీర నేతా"] ఆయనే ప్రేమ స్వరూపుడు. ఆయన అందరియందున్నాడు. కావున ప్రతీ వ్యక్తి - సమస్త ప్రాణికోటి యందు ప్రేమకలిగి యుండాలి ప్రేమలేని జీవితము శ్మశానము. [Life without love is a Cremation ground.] ప్రేమకోసమే ప్రేమించాలి ప్రేమ వలన అన్నియు సాధ్యమగును. ప్రేమయే దివ్యామృతము. దివ్యామృతాన్ని మథించగా వచ్చిన సారమే వెన్నెలవంటి వెన్న. ఆ వెన్న యే ప్రేమ. కావున దివ్యామృత సారమైన ప్రేమను పదిమందికి పంచుము - పరమాత్మను గాంచుము. గోపికలు పరమాత్మను ప్రేమించారు. గోవులు ప్రేమతో దివ్యగానామృతాన్ని ఆలకించి ఆనందించినాయి. అర్జునుడు దివ్యగీతామృతాన్ని అత్యంత ప్రేమతో ఆలకించి, ఆస్వాదించి తరించాడు పార్థుడు ప్రేమతో ఆ అమృతాన్ని మనకూడా అందించి, ఆస్వాదించ మంటున్నాడు. తనకుగల దివ్యానుభవాన్ని మనకు చాటి, మీరుకూడా

నొలాగ దివ్యామృతాన్ని సేవించి, తరించండని అన్నాడు అమూల్య మయిన ఈ నరజన్మలోనే ఈ సదవకాశాన్ని వినియోగించుకొండి. తరించాలంటే ఇదే సమయం. పరమాత్మ ఒక్కడే సత్య స్వరూపుడని "తస్మోపనిషత్ సత్యస్య సత్యమ్" జగత్తంతా మిథ్యయని - విషయ భోగాల్ని వదలి - దైవాన్ని ధ్యానించండి. ఆయనే అభయప్రదుడు. అమృతమయుడు. ఈ సత్యాన్ని సత్యంగా తెలిసికోవాలి సత్యమే జయము పొందును - అసత్యము జయించదు.

"సత్యమేవ జయతే, నానృతం"

[Truth alone will triumph. Untruth will not succeed]

పరమాత్మ - పాపరహితుడు, పరిశుద్ధుడు. పవిత్రుడు [శుద్ధ మపాప విద్ధమ్]. ధర్మ స్వరూపుడు. ధర్మోపదేశమే ఈశ్వర కర్తవ్యము. ధర్మము స్థాపించి సజ్జనులను సంరక్షించుటకు, చెడ్డవారిని చంపుటకు, పరమాత్మ అవతరించును దుష్టశిక్షణకూడ వారికి అనుగ్రహమే. భగవంతుని శిక్షణలో వారి దర్శన భాగ్యమున, వారుకూడ ముక్తి పొందుదురు. అనగా వారు బ్రహ్మను తెలిసికొనుచున్నారు. బ్రహ్మని తెలిసికొన్నవాడు బ్రహ్మయే. "బ్రహ్మ విద్బ్రహ్మైవభవతి" కావున ప్రతివ్యక్తి హృదయశుద్ధి గావించుకొనవలెను. జ్ఞాన తపస్సుచే హృదయశుద్ధి కల్గును. కామక్రోధ భయరాహిత్యం, భగవత్తన్మయత్వం, భగవదాశ్రయత్వమే జ్ఞాన తపస్సు. జ్ఞాన తపస్సు వలన దివ్యామృతాస్వాదనానుభూతి లభించును ఇది స్వానుభూత్యైక వేద్యము. ఎవరికి వారనుభవించియే దీని అనుభూతిని పొందవలెను. ఈ దివ్యానుభూతి ఆనంద స్వరూపము.

అమృతమయ ఆనందస్వరూపుడు పరమాత్మయే. జీవుడు ఆ ఆనందము పొందును. ఆ ఆనందస్వరూపుడే లేనిచో జీవులను నడిపించువాడెవడు? సమస్త ప్రాణి కోటిని ఆనందింపజేయువాడు పరమాత్మయే.

కావున ఆనందమయుడు పరమాత్మ అని తెలిసికోవాలి. వానిచేతనే సమస్త భూతాలు పుడుతున్నాయి, జీవిస్తున్నాయి, లయిస్తున్నాయి.

"ఆనన్దో బ్రహ్మేతివ్య జానాత్, ఆనన్దాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే, ఆనన్దేన జాతాని జీవన్తి ఆనందం ప్రయన్త్యభి సంవిశన్తీతి" అని తైత్తరీయ శ్రుతి.

ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు, సత్య జ్ఞానాలే ఆనందం. ఈ ఆనందం పొందడానికి నిరంతరంధ్యాన మొక్కటియే మార్గము. ధ్యాన మనగా - శ్రద్ధాభక్తులతో దైవనామం నిరంతరం మననం చేయటం దీనివలన ఓంకారదర్శనం కల్గి దివ్యామృతత్వం వస్తుంది. అనగా దివ్య మైన బ్రహ్మానందం కల్గుతుంది. ఉన్నదొక్క ఆనందమే. దుఃఖామలన్నీ మిధ్యతే. విశాలవిశ్వం ఆనందంలో పుట్టి, ఆనందంలో పెరిగి, ఆనందలో లయమవుతు న్న రహస్యం తెలిసికొనిన జీవుడు ఆనందమయ స్వరూపుడే జననమరణాదులనుగూర్చి చింతించరాదు. శోకము పొందరాదు. బాల్య యౌవ్వన వార్ధక్యాది అవస్థలవలె జననమరణాదులు జరుగుచున్నవి. దేహాంతర ప్రాప్తి కల్గుచున్నది. ఈ అవస్థలన్నియు అశాశ్వతమైనట్టి నశించు దేహమునకే ఆత్మసత్యము. అది పూర్వమందున్నది. ఇపుడు గలదు, ముందుండును. దానికి నాశములేదు. అది శాశ్వతమైనది. అదే సర్వవ్యాపి అయిన ఓంకారమని ఎవడైతే తెలిసికొంటాడో వాడే ధీరుడు. అట్టి ధీరుడు దుఃఖించడు. శాశ్వత బ్రహ్మానందము పొందును.

ధీరుడే దుఃఖింపడనగా, సత్యాన్వేషణా తత్పరుడు దుఃఖింపడు వాడే జ్ఞాని. ఆతడే పండితుడు, బుద్ధిమంతుడు, మహాకవి. ప్రాజ్ఞుడు. ఆత్మజ్ఞుడు. ఈ విషయమును మహర్షులు బ్రహ్మచర్య దీక్షవలన ధ్యానసమాధిలో తెలిసికొనిరి. ఈ రహస్యమునె ఉపనిషత్తులు వివరించి

నవి. మనుష్యునకుంగల సర్వ అనుమానాలను తీర్చునవి ఈ ఉపనిషత్తులు పరమాత్మ సర్వవ్యాపి యనియు, ఓంకారదర్శనమే బ్రహ్మానందమనియు సర్వోపనిషత్తుల సిద్ధాంత రహస్యము.

పంచభూతములందు గలది పరాప్రకృతి. జీవరాసులందుండు నట్టి బ్రహ్మ అపరా ప్రకృతి. ఆ బ్రహ్మ ఓంకారమైనది. ధీరులే ఈ రెండింటిని ఒకటిగా ధ్యానింతురు. రెండులేవు అంతా ఓంకార మొక్కటియే. అని ఓంకారము జపించు విధానము, తత్ఫలితములు – పరబ్రహ్మ తత్త్వమంతయు పిప్పలాద మహర్షి శిష్యులకుపదేశించెను. ఓంకారమును సర్వవ్యాపిగా తెలిసికొనిన మానవుడు అమృతమయుడగును.

దేవేంద్రుడు బ్రహ్మజ్ఞానము పొందుటకై బ్రహ్మ చెంతకేగెను. అంతట బ్రహ్మ – దేవేంద్రునిచే 32 వత్సరములు బ్రహ్మచర్య వ్రతము అనుష్ఠింపజేసి, కొంత భాగము బ్రహ్మ జ్ఞానముపదేశించెను. మరలా 32 సంవత్సరములట్లే బ్రహ్మచర్య దీక్షచేయించి, మరికొంత బ్రహ్మజ్ఞానము ఉపదేశించెను. మరల 5 వత్సరములు బ్రహ్మచర్య వ్రతమనుష్ఠింపజేసి- దేవేంద్రునకు పరిపూర్ణమగు బ్రహ్మ విద్యా రహస్యముపదేశించెను. ఇది ఛాందోగ్యోపనిషత్తులో చెప్పబడినది. ఈ పైరీతి ఆ "ఓం" కార స్వరూప రహస్యము తెలిసికొనుటకై దేవతలే బ్రహ్మచర్యాది వ్రతాలనుష్ఠించిరి. ఈ రీతిగా ఉపనిషత్తులన్నియు ఆ పరబ్రహ్మ రహస్యమును బోధించినవి ఆ పరబ్రహ్మ - దేవతల నందరనూ ప్రకాశింప జేయువాడు, దేవతలందరకు పురోహితుడు, ఆచార్యుడు, హితమును కోరువాడు, హవిర్భాగముల నందజేయు అగ్ని స్వరూపుడు, అనియు, అట్టి బ్రహ్మకు నమస్కారమని పురుషసూక్తము.

"యో దేవేభ్య ఆ తపతి యో దేవానాం పురోహితః ।
పూర్వో యోదేవేభ్యో జాతః నమో రుచాయ బ్రాహ్మయే॥"

ప్రేమ స్వరూపుడైన పరమాత్మ కటాక్షముచే సత్సాంగత్యము లభించి దైవమును తెలిసికొనినచో, జన్మ మృత్యు రూపసంసారచక్ర బంధమునుండి విముక్తుడగును. "జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః" "ప్రధాన క్షేత్రజ్ఞ పతిర్గుణేశః సంసార మోక్షస్థితి బంధహేతుః"- భగవాను డొక్కడే స్వయం ప్రకాశకుడనిన్నీ. ఉపనిషత్తునందలి రహస్యము.

ఇట్టి భక్తి ప్రబోధకమైనట్టి ఉత్తమ విద్యయే మానవులకు మోక్షరూపములో శాశ్వతానంద సంధాయకమగును. ఇట్టి ఉత్తమ విద్య వలననే దివ్యామృతాన్ని అస్వాదించగలడు. "విద్యయా అమృత మశ్నుతే". పరమేశ్వర పాదారవింద భజనమునకు ప్రోత్సహింపజాలినవే ఉత్తమ విద్యలని చెప్పిన ధూర్జటి ధూర్జటే !

"..... ..... బోధాఽవిర్భావ నిదానముల్ చదువులయ్యా! కావు నీ పాదసం సేవాసక్తియెగాక జంతు తతిన్ శ్రీకాళహస్తీశ్వరా!!"

వ్యాకరణ తర్కాదిగ్రంథ జాలాన్ని బట్టీపట్టినంత మాత్రాన, మరణ కాలములో ఇవేమియు పనికిరావు. వాటియందలి పరమార్థం పరమాత్మ నిరూపణమేనని, పరమాత్మ జ్ఞాన సంపత్తికై మార్గదర్శకములని తెలిసికొని, నిరంతరము ఓంకారస్మరణచేసి, జ్ఞానులై, "ఆత్మ బ్రహ్మ సమశ్నుతే" అని జీవన్ముక్తిని సంపాదించాలి.

మోక్షము పొందుట అనగా చనిపోయిన తర్వాత లభించునట్టి దనియే అభిప్రాయముకాదు. ఇది ఉపనిషత్తుల సిద్ధాంతముకూడకాదు. బ్రతికి ఉన్నంతకాలము బ్రహ్మానందం పొందుటయు, మరణానంతరం మరల జన్మలేకుండునట్లు చేసికొనుటయు ఉపనిషత్తుల సిద్ధాంతము. జనకాదులెందరో ఇట్లే జీవన్ముక్తులైరి. కావున ఉపనిషత్తులు పఠించి అందలి పరమార్థము తెలిసికొనిన జీవన్ముక్తులు కావచ్చును. మానవులు శరీరముతో ఉన్నంతకాలము నిత్యానందమిచ్చి, తదనంతరము మోక్ష మిచ్చుటకేనని జ్ఞానుల అభిప్రాయము.

హృదయ కమలమున పరమాత్ముడుగలడు. ఆతడు జ్యోతి స్వరూపుడు. నీవారపు ధాన్యపు మల్లు సూక్ష్మాతి సూక్ష్మమై ఉండును. దాని శిఖమధ్యలో పరమాత్మగలడు. ఆ పరమాత్మయే బ్రహ్మ, శివుడు, విష్ణువు, ఇంద్రుడు, ఓంకారస్వరూపుడు, సమస్తమునకు మూలకారణ మైన స్వయంప్రకాశకుడని "స బ్రహ్మ స శివస్స హరి స్సేన్ద్ర సోఽక్షరః పరమస్స్వరాట్," ఆ ఓంకారమే జ్ఞానమిచ్చి శాశ్వతానంద సౌఖ్యమును కలుగజేయునని వర్ణించిన పురుషసూక్తములో - ఓంకారమే బ్రహ్మ, ఓంకారమే వాయువు, ఓంకారమే ఆత్మ, ఓంకారమే సత్యం, ఓంకారమే సర్వకారణస్వరూపం, ఓంకారమే సమస్తమని తెలిసికొని నమస్కరించు చున్నానని - ఓంకార వివరణ గలదు.

"ఓం తద్బ్రహ్మ, ఓం తద్వాయుః, ఓం తదాత్మా
ఓం తత్సత్యం, ఓం తత్సర్వం, ఓం తత్పురోం నమః"

మానవుడై జన్మించినందులకు మంత్రపుష్పము మననము చేసి తీరాలి. ష్వాంతర్గత మకరందామృతమిది.

అందున్నదంతయు ప్రణవార్థమే. ఆపోజ్యోతి స్వరూపము, రసస్వరూపము దివ్యామృత స్వరూపము, బ్రహ్మ స్వరూపము, భూలోక భువర్లోక సువర్లోక స్వరూపమగు ఓంకార స్వరూపమునకు నమస్కారము సమస్త ఉత్తమ విద్యలకు ప్రభువు. సమస్త భూతములకు ప్రభువు. బ్రహ్మలోకాధిపతి బ్రహ్మమున కధిపతిని, పరబ్రహ్మ, గౌరీశుడు, ఓంకార స్వరూపమే. అట్టి ఓంకారదర్శనము సర్వకాల సర్వావస్థల యందు మాకు శుభములిచ్చుగాక!

"త్వం తదాప ఆపోజ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువః ఓమ్"

"ఈశానస్సర్వ విద్యానామీశ్వర స్సర్వ భూతానాం బ్రహ్మాధిపతిః
బ్రహ్మణోఽధి పతిః బ్రహ్మ శివోమే అస్తు సదా శివోమ్॥"

మంత్రపుష్పమందలి రహస్యము ఓంకారోపాసనయే.

ఈ ఓంకారోపాసన వలన బ్రహ్మసాక్షాత్కారము కల్గునను రహస్యమును ధర్మమూర్తి యమధర్మరాజు – నచికేతున కుపదేశించెను. ఆతనికి బ్రహ్మవిద్యను బోధించెను. ఆ బ్రహ్మవిద్యను తెలిసికొనిన ఆ నచికేతుడను బాలుడు మోక్షము పొందెను. ఈ మనోహర మధురగాధ కల్గినదియే కఠోపనిషత్తు. దీనిని శ్రద్ధగా అధ్యయనము చేసి, అందలి భావము గ్రహించి, ధ్యానించిన మోక్షము కల్గును. ఆత్మ యొక్క సాక్షాత్కారమే మోక్షము. అదియే మోక్షవిద్య లేక బ్రహ్మవిద్య. వేదముల చేతను, తపస్సుల చేతను, పొందదగిన బ్రహ్మము - ఓం. [ఓ మిత్యే తత్]

ఓంకారము యొక్క ఉపాసచే బ్రహ్మప్రాప్తి కల్గును. ఓం - కారమే బ్రహ్మ. నాశనములేనిది. ఓం - అక్షరమే శ్రేష్ఠమైనది. ఈ బ్రహ్మ సమస్త భూతములందున్నదానిగా ఉపాసించినవారికి - కోరిన ఫలము సిద్ధించును.

"ఏతద్ధ్యే వాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యే వాక్షరం పరం,
ఏతద్ధ్యే వాక్షరం జ్ఞాత్వాయో యదిచ్ఛతి తస్యతత్."

"ఓం" అని ఉచ్చరించి బ్రహ్మగా ఉపాసించిన బ్రహ్మలోకము పొందెదరు. ఈ బ్రహ్మ పుట్టునది, నశించునది కాదు. ఏ విధమైన మార్పులేనిది. నిత్యమైనది. శాశ్వతమైనది. సనాతనమైనది. జ్ఞేయమైనది. శరీరము చంపబడినను ఆత్మ చంపబడదు.

["అజోనిత్య శ్శాశ్వతో యం పురాణో, న హన్యతే హన్యమానే శరీరే"] అని కఠోపనిషత్తు.

మనస్సు, బుద్ధి పరిశుద్ధమైనచో పరమాత్మ జ్ఞానము సులభముగా కల్గును. శరీరమనేది రథం. దానిమీద ఆత్మరథికుడు ఎక్కి,

ఇంద్రియాలనేగుర్రాల్ని రథమునకు కట్టి, తన మనస్సనే పగ్గంతో వాటిని లాగుతు, బుద్ధి అనే సారథితో రథంతోలుతున్నాడు. ఇంద్రియాల్ని మనస్సునందు, మనస్సుని బుద్ధియందు, బుద్ధిని ఆత్మయందు లయింప జేసిన ఆత్మ సాక్షాత్కారమై మోక్షము లభించును. మోక్షమార్గము కోరు వాడు జీవన్ముక్తుడై చివరకు విదేహముక్తుడగును. ఇంద్రియాదులు పరమాత్మకంటె భిన్నములని, అట్టి పరమాత్మ తన స్వరూపమే అని తెలిసినవారు శోకమోహములను పొందరు. మోక్షమునే పొందుదురు. ఇంద్రియములను, మనస్సును - స్థిరముగా నిగ్రహించుటే యోగము అట్టి యోగముగలవాడే యోగి. యోగికే మోక్షము సాధ్యము.

హృదయమందు 101 నాడులుగలవు. అందు ముఖ్యమైనది సుషుమ్నానాడి. ఇది బ్రహ్మరంధ్రం వరకు వ్యాపించియున్నది. దీని గుండా ప్రాణోత్క్రమణము అయినవానికే ముక్తి గలుగును. ముంజగడ్డి చీల్చి - లోపలుండు ముంజపదార్థం తెలిసికొన్నట్లు అన్నమయ, ప్రాణ మయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములను పంచకోశము లను పొరలను వేరుపరచి ఆత్మసాక్షాత్కారము పొందవలెను. అదే దివ్యా మృతము అదే మోక్షము. ఈ రీతిగా దీనిని తెలిసికొన్నవారు, తెలిపినవారు అమృత స్వరూపులై తేజోవంతులై మధురాతి మధురమైన దివ్యానుభూతి పొందెదరు. ఇది ఉపనిషద్రహస్యము.

వేదవేదాంత వాక్యములు ఆత్మనుగూర్చే చెప్పను. సాధన చతుష్టయ సంపత్త్యనంతరము పరబ్రహ్మనుగూర్చి శ్రవణము నాచరింప వలెను. వినిన అర్థమును విమర్శింప వలెను. పిదప నేనే బ్రహ్మమని ధ్యానింపవలెను. ఇదే పరమపురుషార్థము.

"ఆత్మావా౽రే! ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసి తవ్యః కావున ముముక్షువులను గ్రహించుటకై శ్రీ వేదవ్యాస మహాముని బ్రహ్మ సూత్రములు రచించెను. మొదటి సూత్రము "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" -

అథ - అనగా సాధన చతుష్టయ సంపత్త్యనంతరము బ్రహ్మ విచారణ చేయాలి. నిత్యా నిత్యవస్తు వివేకము, ఇహాముత్రార్థ ఫల భోగ విరాగము, శమాదిషట్కసంపత్తి, ముముక్షుత్వము - అను నాల్గు సాధనములు సంభవించినపుడే ముక్తి లభించును. సచ్చిదానంద స్వరూపమగు బ్రహ్మమే సర్వకాలములందు సత్యమైనది. తద్భిన్నమగు ప్రపంచమంతా అసత్యమైనది. అనగా బ్రహ్మ నిత్యము, తద్భిన్నమనిత్యమని తెలిసి కొనుటే నిత్యానిత్యవస్తు వివేకము. ఈ వివేకము వలన వైరాగ్యమంకు రించును. ఈ ప్రపంచంలో అనుభవించే నారీచందనమాల్యాది భోగముల యందు. పరలోకంలో అనుభవించే రంభా సంభోగాదులందు కోరిక లేకుండుట - ఇహాముత్ర ఫలభోగ విరాగము. నిత్యానిత్యవస్తు వివేకము కలవానికే ఇది కల్గును. పుణ్యము చేయుటచే సర్వము లభించును. అందును కామములే తీరును పుణ్యము క్షీణింపగానే స్వర్గాదులు క్షీణించును. పూర్వకర్మచే సంపాదింపబడిన ఈ లోకము ఎట్లు క్షీణించునో - అట్లే పుణ్యఫలమైన స్వర్గాదులు నశించును. కావున దీనియందు కోరిక ఉండరాదు. ["తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేహ ముత్ర పుణ్యచితో లోకః క్షీయతే" - శ్రుతి] శమము, దమము, ఉపరతి, తితిక్ష శ్రద్ధ, సమాధానము అను శమాదు లారింటిని కల్గియుండవలెను. ఇదే శమాది షట్కసంపత్తి

శమమనగా మనోనిగ్రహము. దమమనగా ఇంద్రియ నిగ్రహము బ్రహ్మ విషయమందే సంకల్పముండుట - ఉపరతి. శాస్త్రములనే విచారించుచు, శీతోష్ణాదులను లెక్కచేయకుండుట - తితిక్ష. వేదాన్తాది వాక్యములందు, సద్గురు వాక్యములందు, ఉంచవలసిన నమ్మకమే శ్రద్ధ. సమస్త సంకల్పములను పరిత్యజించి - మనస్సును బ్రహ్మయందే ఉంచి శాంతిని పొందుట - సమాధానము. పై సాధనములు కలిగి మోక్షమందు దృఢానురాగమైన మనస్సుగలవాడై నిరంతరము ధ్యానిం

చుటయే ముముక్షుత్వము. ఈ రీతిగా సాధనసంపత్తి ముందు కలుగ వలెను. ["అథా తో బ్రహ్మ జిజ్ఞాసా"] తర్వాత బ్రహ్మ విచారముచేయాలి తర్వాత సూత్రము 1, 2. జన్మాద్యస్యయతః, 3 శాస్త్ర యోనిత్వాత్, 4. తత్తు సమన్వయాత్ - ఈ రీతిగా, బ్రహ్మ విషయ వేదాంత వాక్యము లిందుగలవు.

జనకమహారాజు చేయు యజ్ఞమునందు ఉత్తముడైన యాజ్ఞ వల్క్య మహర్షిని బ్రహ్మవేత్తగా గౌరవించి, సత్కరించిరి. వారిని గార్గి యను స్త్రీరత్నము ఎన్నోరీతుల పరీక్షించెను.

ఆమె అవ్యాకృత రూపమైన (ప్రకటింపబడనిది) ఆకాశం ఏ పదార్థమున పడుగు పేక భావమును చెందియున్నది? "కస్మి న్నుఖ ల్వాకాశ ఓతశ్చ ప్రోతశ్చేతి?" – అని ప్రశ్నించెను. "ఓ గార్గీ! సర్వాధార మగు ఆకాశమునకు ఆధారమైనది ఓంకారము. ఓంకారము స్థూలత్వము కృశత్వము మొదలగు ధర్మములు లేనిద"ని బ్రహ్మవేత్తలు చెప్పుదురని సమాధానమిచ్చెను. ఓంకారమే సర్వవ్యాపి, సర్వమునకు మూలాధార మను రహస్యమును గార్గి గ్రహించెను.

[ "ఏ తద్వైత దక్షరం గార్గి బ్రహ్మణా అభిపదం త్యస్థూల మనణు" - ఇది యాజ్ఞవల్క్య మహర్షి సమాధానము.] కావున బ్రహ్మ వేత్తలు తెలిసికొనిన పరబ్రహ్మము - ఓంకారము. సర్వకాల సర్వావస్థల యందు నిత్యమై ఉండునది - ఓంకారము ఓంకారభిన్నము అనిత్య మని తెలిసికొనుటయే నిత్యానిత్య వివేకము.

ఇహలోకంలో నారీచందనమాల్యాది భోగములు అశాశ్వతములు దుఃఖములు కల్గించునవి. సంసారసుఖములు ఎండమావుల వంటివి. శరీరమూ అసహ్యకరమైనది. పురుషునకు స్త్రీయందలి భోగవాంఛ యుండుట, స్త్రీకి పురుషునియందు భోగవాంఛ యుండుట - సుఖప్రద

మని జ్ఞానులు పురుషునకు స్త్రీయందును, విరక్తి కల్గినగాని, ధ్యానమందు రక్తి కలుగదు. ధ్యానమందు రక్తి కుదిరినగాని భక్తిరాదు. భక్తివలన జ్ఞానము తద్వారా ముక్తికదా! కావున ఇహ, పరలోక సుఖములందు కోరిక నశించవలెను. దేహిని తెలిసికొనుటకే దేహము ప్రసాదించెనుగాని, తుచ్ఛ శారీరక సుఖములకోస మీ శరీరమివ్వలేదు. మానవ జన్మమందే పరమపురుషార్థమగు మోక్షమును పొందవలెను. ఈ ఉత్కృష్ట నరజన్మ మందే మోక్షము సాధింపనివారి జన్మ, షండునకు రంభ ప్రాప్తించి నటుల వ్యర్థమే అగును.

విశాల విశ్వమందు, పర్వతాలు, కొండలు, గుట్టలు, పుట్టలు, చెట్టులు, చేమలు, నదీనదములు, మొదలగునవెన్నియో అచేతనములు కలవు. కోట్లానుకోట్ల జీవరాసులు గలవు. అనేక కోట్ల జన్మలందు - ఎపుడో ఒకప్పుడు జీవుడు చేసిన పుణ్యమువలన ఈ మానవ శరీరము ప్రాప్తించినది. మోక్షసాధనము నధిరోహింపవలెనన్న ఇదొక్కటే సోపానము. అట్టి మానవ దేహమును పొంది - తన కర్తవ్యము నెరవేర్చు కొనకపోయిన, అతని జీవితము వలన ప్రయోజనమేమి? తనను తానే రక్షించుకొనవలెనుగాని, తన్నెవడును రక్షింపలేడు.

స్నేహితుడగు వైద్యుడు మనవగ్గరే ఉన్నపుడు. మనకున్న రోగమునకు చికిత్స చేయించుకొనవలెను. వైద్యుడు లేని సమయంలో రోగం ఎటుల నయంచేసికోగలడు? అది అసంభవము. అటులనే, మానవ శరీరం ఉండగానే భవరోగమునుండి విముక్తులు కావాలి. ఈ శరీరం లేకుంటే భవరోగం నయంకాదు. "అందుకే, దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలంటారు." దానర్థం - దేహం ఉండగానే దేహిని తెలిసికో వాలని, అంటే ఆత్మని తెలిసికోవాలి. ఇల్లు అంటుకున్నాక, నూయి త్రవ్వడం ప్రారంభిస్తే - ఎలాంటిదో, అల్లాగే ముసలితనం వచ్చాక, కళ్ళు కనబడని సమయంలో, కాళ్ళు ఆడనినాడు, మాటరానప్పుడు,

మనుషులు పలకనప్పుడు, శరీరం తనమాట విననప్పుడు - తనేం చేయ గలడు? కావున వయస్సుతో నిమిత్తంలేక రేపనే వాయిదా వేయక ప్రతి క్షణం దైవధ్యానం చేయడమే ప్రథమ కర్తవ్యము.

చిల్లుకుండయందలి నీరులా, మన దేహమనే చిల్లుకుండలోంచి ఆయుర్దాయమనే నీరు జారుతుంటున్నది వయసు పెరుగుతున్నదని సంతోషిస్తున్నామేగాని, ఆయుర్దాయం తరుగుతుందని అనుకోవటంలేదు. బ్రతకాలనే ఆశకంటె బ్రహ్మధ్యానం చేయాలనే ఆశ, క్రమక్రమంగా పెరగాలి. బ్రతుకు తగ్గేటప్పటికి అంతా బ్రహ్మం కావాలి. గట్టిగా ఊదిన బుడగ అయినా ఎంతసేపులో బ్రద్దలవుతుందో చెప్పలేం. బుడగ ఎంత సేపు నీటిమీద ఉంటుంది. బుడగలాంటి ఈ జీవితం - బుద్ధిమంతునికి బ్రహ్మానందాన్నిస్తుంది.

ఈ దుఃఖసముద్రాన్ని దాటడంకోసం, శరీరమనే ఈ పడవను పుణ్యమనే డబ్బు ఇచ్చి కొనుక్కున్నాం. పడవ నాశనం కాకుండానే ఈ దుఃఖ సముద్రాన్ని దాటాలి. పడవ మధ్యలోనే బ్రద్దలయిందా దుఃఖ సముద్రంలో మునిగిపోతాం. మరి తేలడం ఉండదు. మనుష్యత్వము, వివేకము కలగడం కష్టం. కలిగినందుకు సార్థకం చేసికోవాలి. కుక్క, గాడిద మొదలగు పశువులు ఆహారాన్ని తింటున్నాయి, నిద్రిస్తున్నాయి, కొడితే భయపడుతున్నాయి, భార్యా పుత్రాదులతో సుఖాన్ని అనుభవిస్తు న్నాయి. బుద్ధిలేని పశువులుచేసే పనులే, బుద్ధివున్న మానవులూచేస్తే పశువులికి - పండితులకి భేదం ఏమిటి? కావున దూరదృష్టిగల విజ్ఞాన వంతులు వేదాన్త వాక్యములను సమన్వయించి యుక్తుల సహాయంచే ప్రపంచమంత అనిత్యమని గ్రహించి యోగ్యురాలైన భార్యను, పండితు లైన పుత్రులను, సమస్త ఐశ్వర్యమును, సుందరమందిరాన్ని వదలి - ఆత్మానందము పొందుతారు.

శరీర లక్షణం :- తొమ్మిది గుమ్మాలున్న తలుపులులేని ఒక పంజరమును, ఎగిరే చిలక చూచింది. ఏదో గుమ్మంలోంచి లోనికి ఆ చిలుక ప్రవేశించింది. దానిష్టంవచ్చినంతసేపుంది. దానికి తోచినపుడు ఏదో గుమ్మంలోంచి విశాల గగనంలోకి ఎగిరిపోయింది. ఇటువంటిదే మన జీవితం.

ఇది అస్థిపంజరం. ఈ ఎముకలతో కట్టిని పంజరానికి తొమ్మిది గుమ్మాలున్నాయి. తలుపులులేవు. ఈ పంజరంలో ప్రాణవాయువనే చిలక ప్రవేశించింది. ఆ ప్రాణవాయువు దానిష్టంవచ్చినంతసేపు ఈ పంజరంలో ఉంటుంది. ఉన్నంతసేపూ ఉన్నందుకు ఆశ్చర్యపడాలి. అది ఎగిరిపోతే ఆశ్చర్యపడనవసరంలేదు. కారణం ఈ గుమ్మాలకి తలుపులులేవు. ఉండాలని నిర్బంధంలేదు. దానిష్టం, ఎప్పటి వరకూ ఉంటుందో? అది ఉన్నంతకాలం మధురాతిమధురమైన ఆ దివ్యామృత రసాస్వాదనచేస్తే అందని ఆనందం - ఆత్మానందం కలుగుతుంది.

ఈ దివ్యామృతానందం ఇంట్లోగాని, భార్యాపుత్ర ధనాదుల్లోగాని లేదు. ఈ సుఖములన్నియు మేడిపండులాంటివి. పైకి రమ్యంగా ఉంటాయి. పొట్టవిప్పిచూస్తే ఉండేవన్నీ పురుగులే. భార్యకి భర్త, భర్తకి భార్య - వెలుపలకి అత్యంత రమణీయంగా కనబడతారు. లోపల మాత్రం మలమాంసాది దోషాలున్నాయి. అది శరీర లక్షణము. సంసార భోగములు ఇంద్రజాలికుని మాయవంటిది. శుక్తిరజత భ్రాంతివంటిది. ఎండ్రకాయ చెరువులో నివసిస్తుంది. ఎండాకాలంలో ఆ చెరువులో నీరు ఎండిపోతుంది. అయినా, ఆ స్థానాన్ని వదలలేక దానియందలి ప్రేమచే అక్కడే ఉండి, చివరకి మరణిస్తుంది. అట్లే గృహస్థులుకూడా సంసారమందలి ప్రేమచే గృహాల్ని వదల్లేక ఎన్నో దుఃఖాలనుభవిస్తూ దేహాన్ని వదలుతున్నారు. జన్మ నిరర్థకం చేసికుంటున్నారు.

శరీరసుఖాలు, సుఖాలని నమ్ముతున్నారు. పట్టుపురుగు స్వశరీర రక్షణకోసం, తన నోట్లోంచి వచ్చే దారాలచే తన శరీరంచుట్టూ దట్టంగా చుట్టుకొని, చివరికి బయటికి రాలేక అందులోనే ప్రాణం వదిలేస్తుంది. ఈ రీతిగా మానవుడు, తాను ఒంటరిగా జీవించలేననుకొని, తన రక్షణకై భార్య, గృహం, పుత్రమిత్రాదుల్ని సంపాదించుకొని వారి యందు ప్రేమని పెంచుకొంటాడు చివరకు ప్రేమపాశాన్ని త్రెంచుకోలేక ఆ పాశాల్లోను ఆశాపాశాల్లోను బంధింపబడి, బ్రహ్మసాక్షాత్కారం కోసం ప్రసాదింప బడిన బంగరు శరీరాన్ని, వృధాచేసి వదిలేస్తున్నాడు. ఇవన్నీ నిజమైన ప్రేమ స్వరూపాలు కావు. నిజమైన, నిత్యమైన ప్రేమ స్వరూపం మధు రాతి మధుర దివ్యామృత స్వరూపమే. ఈ మానవులు ఆ మధుర దివ్యా మృతాన్ని మరచి, ప్రేమ పాశాలనే సంకెళ్ళలో తగిలి, కాంతల అధరా మృతాన్ని ఆస్వాదించి అధఃపతనానికి దారి, తామే వెతుక్కుంటున్నారు. అధరామృత మన్నపదం అలంకారిక భాషలో చెప్పిన పదం. నిజానికది 'నోటి చొంగ' ఇద్దరు వ్యక్తుల నోటి చొంగలు కలియడం అనారోగ్యమని విజ్ఞాన శాస్త్రజ్ఞుల అభిప్రాయం. అధరాదిచుంబనాలు అంతగ శ్రేయో దాయకం కావు. ఇవి కృత్రిమ ప్రేమచిహ్నాలు సంసారంలో ఏదో సుఖం ఉందనుకోవడం – మృగతృష్ణలాంటిది. ఇందు సుఖం లేశమైనాలేదు. ఉందని భ్రాంతిపడడానికి కారణం అజ్ఞానం. శరీర విషయాల ఆశా పాశాల్ని వదల్లేక,. కదల్లేక కామాది వికారాలకు లోనై కన్నుకానక కాన్తా స్వరూపమే కమనీయంగా భావించి మోహాంధుడై ఆమె మంజూక్తుల వలలో దగిలి మోసపోతున్నాడు.

ఇన్నింటికీ మూలం ఈ శరీరం. ఈ శరీరంలో ప్రతీ అవయవం దోషభూయిష్ఠం. నోరుచూస్తే అందున్నది చొంగ. ముక్కులో చీమిడి, కంటిలో నీరు, పుసి. శరీరానికి వెలుపల చెమట, లోపల మలమూత్రాలు ఆహా! శరీరధర్మం ఎలాంటిది. ఇట్టి శరీరాన్ని ఎంతగా ఉపయోగిస్తున్నారు

దీని నిజస్వరూపాన్ని ఆలోచించి, దీని ప్రయోజనాన్ని తెలిసికొన్నవాడు, దీని ఉపయోగం తెలుస్తుంది. ఎర్రని నిప్పుని పండని భ్రమించిన మిడతలు, దాన్ని పొంది నశిస్తున్నాయి. నిప్పులాంటి సంసారంలో సుఖఫలం ఉందని భ్రమించి మిడతలాంటి మానవుడు దానిలాగే చేస్తున్నాడు వీడు మోహాంధుడై మోక్షాన్ని మరచి మేను చాలిస్తున్నాడు. ఇందలి సత్యాన్ని గ్రహించి ఎండమావుల్లాటి విషయసుఖాల్ని వదలి, భగవద్ధ్యానం చేయాలి. బ్రహ్మ ఒక్కటే సత్యం, నిత్యం. తద్భిన్నం అనిత్యం. దేహం క్షణికం. మరణం తథ్యం, కావున ధ్యానమే ధ్యేయం.

అధికధనం సంపాదించాలనే ఆత్యాశవదలి జనన మరణ రూప సంసారమనే మృత్యువుని జయించి,

భగవదనుగ్రహాన్ని వరించి, ఓంకారాన్ని ధ్యానించి, మోక్షం పొంది తరించండి.

## ఆత్మజ్ఞాని

శ్లో॥ అమాత్రోఽనన్త మాత్రశ్చ ద్వైతస్యోపశమః శివః ।
ఓంకారో విదితో యేన సమునిర్నేతరోజనః॥

అమాత్రము అనంత మాత్రము కలిగిన ఓంకారము ద్వైతము ఉపశమించుటచే శివము. అనగా సర్వమంగళ కరమైనది. ఈ రీతిగా ఓంకారమును తెలిసికొనినవాడే ముని. ఇతరుడు కాడు.

మాత్ర అనగా పరిమాణము. అమాత్ర అనగా పరిమాణ రహితము. అదే తురీయమును సూచించు నిశ్శబ్ద ఓంకారము. అనంత మాత్ర - అనగా అనంతమైన పరిమాణము గలది. దేనిచేతనైనను కొలుచుటకు వీలులేనిది. అదే - ఓం. "ఒక కొలతబద్దతో కొలిచి చెప్పనట్టి పరిమితిలేనిది " అని శ్రీ శంకరులు చెప్పిరి.

'ఓం' కారమొక శబ్దమనియే కాక, అనంతమైన అర్థముప్నదని అది పరబ్రహ్మకే మూలాధారమని ఎవడు తెలిసికుంటాడో - ఆతడే ఆత్మజ్ఞాని. ఆతడే మోక్షార్హుడు. ఆతడే ముని. ఆత్మజ్ఞానం తెలిసికోనివాడు మునికాడు. ఆత్మజ్ఞానం తెలిసికోకుండా తెలిసినట్లు నటించి, ఉపన్యాసాలు చెప్పినంత మాత్రాన అతడు ముని కాజాలడని తెలియుచున్నది.

ఓంకారమందలి అర్థము గ్రహించాలి. ఓంకారమును, ఎల్లప్పుడు మననము చేసి, ఓంకారముచే తెలుపబడిన - ఈ సర్వవ్యాపి నిత్యసత్య జ్ఞానతత్వాన్ని తనలోనే చూసేవాడే - ఆత్మజ్ఞాని. ఆతడే స్థితప్రజ్ఞుడు, ఆతడే పండితుడు, ఆతడే బ్రహ్మ, ఆతడే శివుడు, ఆతడే విష్ణువు. ఇన్ని మాటలెందుకు? - ఆతడే "ఓమ్"

ప్రపంచము భ్రాంతి మూలకమైనది. ఇది ద్వైతభావము గలది. ప్రకృతి - పురుషుడు, తల్లి - తండ్రి, గురువు - శిష్యుడు, ఆత్మ - పరమాత్మ [దృష్టి], భార్య - భర్త, యజమాని - సేవకుడు, ఈ రీతిగా సృష్టి అంతా ద్వైతభావంలో ఉంది. అంటే నువ్వూ - నేను అనే రెండు భావాలు కనబడుతున్నాయి. ఈ ద్వైతభావం తొలగాలంటే నువ్వే నేనని, నేనే నువ్వనే సత్యాన్ని తెలిసికోవాలి. అంటే సత్యాన్వేషణ చేయాలి. అందుకే శ్రీ వ్యాసులవారు - "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అన్నారు ఇక్కడి అథలోనే అంత వ్యవహారం ఉంది. అథ అంటే సాధన చతుష్టయ సంపత్తి కల్గిన తర్వాత బ్రహ్మనుగూర్చి చర్చించాలి. కావున బ్రహ్మను వెదకాలి. ఆ పరమాత్మ సత్యస్వరూపుడు. జ్ఞానము, అనంతము. "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ". పరమాత్మకు "కేవలము సత్యము" - అని ఉపనిషత్తులతో చెప్పబడింది. "తస్యోపనిషత్ సత్యస్య సత్యమ్"॥ విశాల విశ్వం అంతా సృష్టి స్థితిలయాలకు లోబడింది. విశ్వంలో ప్రతి వస్తువు ఏదో ఒకనాడు నశిస్తుంది. ఉన్నంతకాలం ప్రతీ వస్తువు మారుతూ ఉంటుంది. కనబడేదంతా అసత్యమే. అంటే జగత్తంతా మిథ్య. అయితే,

సత్యమైనది ఒక్క పరమాత్మే. మనం బ్రతికి ఉన్నంత కాలం లోకవ్యవహారం కోసం కనబడేవి సత్యమని అనుకుంటాం. తామరాకునందలి నీటిబొట్టులా, ఈ జగత్తులో ఉండి సత్యాన్వేషణ చేయాలి. అంటే నీటిబొట్టు ఉండటానికి ఆకు కావాలి. కాని, ఆకుకి నీటిబొట్టు అంటదు. అట్లే ఈ విశ్వంలో ఉండి, స్వధర్మాన్ని పాటిస్తూ, ఈశ్వరుని ధ్యానించాలి. అపుడు సత్యంగా సత్యం సాక్షాత్కరిస్తుంది. సత్యము నమ్మినవారు జ్ఞానులే. మహాత్మాగాంధి సత్యమే జయము పొందితీరుతుందనే దృఢనమ్మకంతో "సత్యాగ్రహం" చేసి, స్వతంత్ర్యాన్ని సాధించిన సంగతి మనందరకూ తెలిసిన విషయం. హరిశ్చంద్రుడు సత్యాన్నే నమ్మి, ఎన్ని కష్టాలొచ్చినా ధైర్యంగా నిలబడి, తుదకు విజయం సాధించాడు, సత్యహరిశ్చంద్రుడుగా యశఃకాయుడైనాడు. సత్యాన్ని నమ్మనివాళ్ళెందరో మనుష్య జీవితాన్ని వ్యర్థం చేసికొన్నారు. సత్యాన్ని నమ్మి చెడినవారులేరు; ఉండరు. ఏలన పరమాత్మే సత్యానికి స్థానం.

సత్యమే దివ్యామృతం. అది అభయప్రదం. అదే పరబ్రహ్మ ఈ పరబ్రహ్మకే సత్యమని పేరు - అని ఛాందోగ్యశ్రుతి.

"సత్యమే జయిస్తుంది. అసత్యం జయించదు"

[సత్యమేవ జయతే, నానృతం] అని ముండకోపనిషత్తు.

[Truth alone will triumph. Untruth will not succed]

దీనికి ప్రత్యక్ష ప్రమాణం మహాత్మాగాంధీగారే.

సమస్త జగత్తూ నశించేది. నశించనిది పరబ్రహ్మ. బ్రహ్మ నుండియే సృష్టి ప్రారంభమయినది. ఈ ప్రకృతి మాయ. పంచభూతములు నశించునవే అయినపుడు పంచభూతాత్మకమైన వస్తుజాలమంతా నశించేదే అని తెలుస్తోంది. ఈ నశించేదే సుఖమని చార్వాకుల సిద్ధాంతము. వారికి ఆకాశ భూతములేదు. కారణము అది ప్రత్యక్షముకాదు కావున అని వారి సమాధానము. వారికి ప్రత్యక్షమే ప్రమాణం ప్రపంచ

సుఖాలే అనుభవించాలి - అంటారు. వారుచెప్పే విషయాలన్నీ అసంద ర్భములే. ప్రత్యక్షమునే ప్రమాణంగా నమ్మేవారు, తమ దర్శనం బృహ స్పతి ప్రోక్తమని చెప్పారు. అంటే ఆప్తవాక్యం ప్రమాణం కాదంటారు. ఒక్క ప్రత్యక్షమే ప్రమాణం అంటారు. ఇది స్వవచో వ్యాఘాతమే కదా!

చార్వాకుల ఆలోచనలు సుఖ దుఃఖాల అనుభవాల వరకే వెళ్ళాయి. వాటి అనుభోక్త ఎవరో వారికి తెలీదు. నాలుగు భూతాలనుండి చైతన్యం పుట్టింది అన్నారుకాని అనుభోక్త ఎవరో చెప్పలేదు. పృధివ్యాప స్తేజో వాయువుల పుట్టుకకు కారణం ఎవరికో వారికితెలీదు. ఆకాశం లేకుంటే ఇవి ఎలా పుడతాయో వారికసలే తెలీదు. [పృథివ్యా దీని భూతాని చత్వారి తత్వాని. తేభ్య ఏవదేహకారణ పరిణతేభ్యః మదశక్తి వత్ చైతన్య ముపజాయతే।] ఇవన్నీ అసందర్భపు మాటలే. అసత్యాలు ఇంకో చిత్రం ఏమిటంటే, లౌకిక కామోప భోగాల్లో కేవలం సుఖం లేదన్నారు. ఉన్న కొంచెం సుఖం దుఃఖమిశ్రితం అని వారే అన్నారు. ఈ విధంగా దుఃఖమిశ్రితముగాని, సుఖం అసంభవమని చెప్పడంలోనే చార్వాకుల్లో ఉన్న పెద్దలోపము.

పరమాత్మని తెలిసికొంటే బ్రహ్మానందం కలుగుతుందని, అది శాశ్వతసుఖాన్ని ఇస్తుందని, శ్రుతి, స్మృతులే ప్రమాణాలు. స్వానుభూతి చేతను తెలిపిన యోగులుకూడా ప్రమాణమే. కట్టిన ఇల్లు ఉంది- అంటే దాన్ని కట్టించిన వ్యక్తి ఒకడు ఉండాలి. కర్తలేని కార్యం పుట్టదు. అలాగే భూమి, వాయువు, మొ॥ భూతాలున్నాయంటే, వాటిని సృజిం చిన వ్యక్తి ఒకడు ఉండి ఉండాలి. విశాల విశ్వాన్ని సృజించిన కర్తయే బ్రహ్మ. ఈ భూతాలన్నీ దేన్నుండి పుట్టుచున్నాయో, పుట్టినవి దేనివలన జీవిస్తున్నాయో, దేనివలన నాశనం పొందుతున్నాయో, నశించి మరల దేనిని ప్రవేశిస్తున్నాయో దానిగురించి తెలిసికోవాలి - అదే బ్రహ్మ.

"యతోవా ఇమాని భూతాని జాయన్తేయాని జాతాని జీవన్తి।
యత్ప్రయన్త్యభి సంవిశన్తి, తద్వి జిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి॥

వీరు ఆత్మలేదంటే కుదరదు. వీరీ రీతిగా మాట్లాడుతున్నా రంటే అజ్ఞానంచేతనే అని చెప్పక తప్పదు. కావున వారిమతం హేతు వాద విరుద్ధమైంది. దేవుడులేడు, లేడు అని వీరంటున్నారంటే. ఉన్నా డని నమ్మకం వారికి ఉందన్నమాట. దేవుడు ఉంటేనే కదా లేడనే మాటచెప్పడం. అసలు లేనప్పుడు లేడనేమాట చెప్పడం వ్యర్థం. కావున దేవుడున్నమాట సత్యం. అస్తి ఉంటేనే నాస్తి అంటా నాస్తి – అయితే అస్తి.అనేమాటలేదు – పరమాత్మ విషయంలో. "నాస్తి"లో "అస్తి" ఉంది కాని "అస్తి"లో మాత్రం "నాస్తి" లేదు. ఇది చిత్రమయిన విషయం. అంటే ఉన్నదంతా "అస్తి" ఒక్కటే. ఈ మిధ్యా ప్రపంచం ఉందను కుంటున్నాం. అంటే ఈ ప్రపంచం నిజానికి లేదు. [నాస్తి] ఈ ప్రపం చాన్ని సృజించిన "ఆత్మ" ఉన్నది [అస్తి] ఆత్మలో మాత్రంలేంది లేదు [నాస్తి] ఇదే ఇందలి రహస్యం. కావున సత్యమైనది ఆత్మ ఒక్కటే. అదే పరబ్రహ్మ. కావున చార్వాకాది నాస్తిక మతాలు సందర్భంలేని పొల్లుమాటలు. నిత్య సత్యమైన "ఓం" కారం సమస్త సృష్టికి కారణ భూతం. ఆ సత్యాన్ని గమనించి సత్యాన్వేషణ చేయడమే బుద్ధిమంతుల లక్షణం. ఓంకారం ఉచ్చరించడంచేత సమస్త శుభాలు జరుగుతాయి. ఇది సర్వ మంగళకరమైంది. ఇదే మోక్షాన్ని ప్రసాదిస్తుంది. అని తెలిసి కొన్నవాడే ముని. మౌనం మాత్రం కలవాడే మునికాడు. నోరు మూసు కొన్న మాత్రంచేత వాడ్ని ముని అనరు. ఓంకారార్థం గ్రహించి దాన్ని ధ్యానించేవాడే ముని.

ఓంకారంలో అకార, ఉకార, మకారములకు మాత్రమే మాత్రలున్నాయి. తురీయపాదం మాత్రారహితము. 'ఓం'కి ఓంకి మధ్య గల స్థితియే తురీయస్థితి. అనగా ఓం పూర్తిగా ఉచ్చరించిన తర్వాత గల ప్రశాంతస్థితి. ఇది మాత్రారహితము, అనంతము, జ్ఞాన స్వరూపము ఈ అనంతమైన జ్ఞాన స్వరూపాన్నె తెలిసికోవాలి. అతడే వేదవిదుడు

శ్లో॥ "తైలధారా వదచ్ఛిన్న దీర్ఘం ఘంటా నినాదవత్,
అప్లుతం ప్రణవస్యాంతం యస్తం వేద స వేదవిత్॥"

తైల [నూనె] ధారవలె అవిచ్ఛిన్నమైనట్టిదియు, ఘంటా నాదం వలె దీర్ఘమైనట్టిదియు, ప్లుతముతో గూడినదియు, ప్రణవాంతమందలి నాదమేది కలదో దానిని తెలిసికొనినవాడే జ్ఞాని. అంటే తురీయావస్థలోనే బ్రహ్మానందమున్నది. ఓం అని ప్లుతంతో ఉచ్చరించగా తురీయమైన స్థితి కావలేను. సంగీతమువలన కూడ ఈ స్థితి కల్గును. సంగీతములో కూడ ఓంకారార్థమే ఉన్నది. కావుననే సర్వుల హృదయములను ఆకర్షించి, తన్మయత్వము కల్గుచున్నది. తర్వాత ఓంకార ధ్యానంతో మోక్షం లభిస్తుంది. త్యాగరాజాదులీ రీతిగా పరబ్రహ్మని సాక్షాత్కరింపజేసికొన్నారు.

శ్రీకృష్ణ పరమాత్మ గీతాగానంచేసి ఎందరినో తరింపజేశారు. మురళీగానంవిన్న గోపికలు, గోవులు, గోపకులు మరెందరో తరించారు. వారు మురళిగానం విని తరిస్తే, అర్జునుడు, ధృతరాష్ట్రుడు మొదలగు వారు గీతాగానం విని తరించారు. గీతాగానంచేత మనందరంకూడా తరించవచ్చు కావుననే ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత ఆర్షమతానికి పునాది గ్రంథాలు. ఈ ప్రస్థానత్రయం పరబ్రహ్మప్రాప్తి సాధనం.

శ్లో॥ అకారో నయతే విశ్వముకారశ్చాపి తైజసం ।
మకారశ్చపునః ప్రాజ్ఞం నామాత్రే విద్యతే గతిః॥

అకారము ధ్యానించినవాడు విశ్వుని, ఉకారమును ధ్యానించువాడు తైజసుని, మకారమును ధ్యానించువాడు ప్రాజ్ఞుని పొందుచున్నారు మాత్రారహితమైన నిశ్శబ్దము ధ్యానించువాడు పరమాత్మతో లీనమగును. ఇందలి రహస్యము ప్రతి సాధకుడు గ్రహించవలెను.

ఓంకారము పూర్తిగా ఉచ్చరించి, మరొక 'ఓం' కారం ఉచ్చరించే లోపుగా - ఆ మధ్యలో సాధకునకు ఒక మాత్రారహితమైన మౌనం కల్గుతోంది. ఆ మహత్తర మౌనంపై ధ్యానం ఉంచేవాడే బ్రహ్మజ్ఞాని ఈ పరమ రహస్యము, సమస్త ఉపనిషత్తులలో ఉత్తమోత్తమమైనదిగా పరిగణింపబడే మాండూక్యోపనిషత్తునందు వినబడుచున్నది.

మంత్రము : "అమాత్రశ్చతుర్థోఽవ్యవహార్యః ప్రపంచోపశమః ।
శివోఽద్వైత ఏవమోంకార ఆత్మైవ సంవిశత్యాత్మ నాఽఽ
త్మానం య ఏవం వేద॥"

మాత్రారహితమై, అవ్యవహారమై ప్రపంచోపశమము కల్గి, శివమై అద్వైతమైన ఓంకారమే చతుర్థము. అదే - ఆత్మ. దీనిని తెలిసికొన్నవాడు పరమాత్మలో లీనమగుచున్నాడు. ఇది నిత్యానందమయమైన అద్వైతస్థితి. ఈ దివ్యామృత రసాస్వాదనకై సాధకులు ప్రయత్నించి సాధించాలి.

ద్వైత భావంవల్లనే - అసంతృప్తి, కలతలు, భయాదులు కల్గుతున్నాయి. మాత్రారహితమైన నిశ్శబ్ద ఓంకారమును ధ్యానించువానికి, ఈ ద్వైతభావం తొలుగును అద్వైతస్థితి కల్గును. ఆ దివ్యామృతానందానుభూతిలో లీనమై నిత్యసత్య పరమాత్మ స్వరూపుడగును. అదే తత్వమసి.

అదే శాంతి ఆశ్రమము. ఆ దివ్యానుభూతి ఉన్నచోటుకి నిట్టూర్పులుగాని నిరాశలుగాని, దుఃఖంగాని, భయంగాని, కామాదులుగాని దాడిచేయలేవు. అది సర్వజ్ఞము, సర్వశక్తిమంతము. అదే సర్వసంపూర్ణ జ్ఞానము. ఇదే తత్త్వమసి యందలి రహస్యము మనకు తెలియకుండగనే కలుగు ఈ దివ్యానుభూతియే సోఽహం. అదే - "ఓమ్".

ఓంకారమే పరబ్రహ్మ కావున, ఆత్మని తెలిసికొన్న వ్యక్తి బ్రహ్మానందము పొందును. ఇదే అహం బ్రహ్మాస్మి. ఈ జ్ఞానం నిత్య సత్య సత్యతత్త్వమైన ఆత్మయే పరమాత్మ అనే జ్ఞానము. అదే ప్రజ్ఞానం బ్రహ్మ. "జగన్మిథ్యా - బ్రహ్మసత్యం" - అని తెలియడమే అద్వైతం ఉన్నదంతా అద్వైతము ఒక్కటే అయినప్పుడు భయాదులు కలుగుటకు అవకాశంలేదు. సమస్త భయాలకి దుఃఖాలకి కారణం ద్వైతంలో ద్వైతం ఉండదు. అద్వైత భావమైన ఏకస్థితిలో అంతా బ్రహ్మానందమే.

సంకల్పాదులు ఇంద్రియాల్లో కలుగవు. సంకల్ప వికల్పాదులకు మనస్సె కారణం. భయాదులన్నీ మనస్సువలనే కలుగును. అట్టి మనస్సును — ఓంకారమందు ఏకాగ్రం చేసిన అద్వైతస్థితిలో ఒక్క ఓంకారమే కలదు మనస్సులేదు, కావున అతనికే రాగద్వేషభయాదులు కలుగవు అతడు బ్రహ్మజ్ఞాని, నిత్యానందుడు. ఇదే "ఆనందోబ్రహ్మ" అనే ఉత్తమస్థితి. ఇది అనిర్వచనీయము, స్వానుభూతిచేతనే తెలియదగిన దివ్యామృతము. కావున దీనిని శ్రద్ధగా ధ్యానించాలి,

శ్లో॥ యోఽధీతేఽహన్యహన్యేతాం త్రీణి వర్షాణ్యతంద్రియః
స బహ్మపదమభ్యేతి వాయుభూతఃఖమూర్తిమాన్॥

ఎవడు ప్రతిదినము సోమరికాక — ఓంకారపూర్వకములయిన మహావ్యాహృతులను మూడు సంవత్సరముల కాలం ధ్యానిస్తాడో వాడు పరబ్రహ్మను పొందును. అట్టివాడు వాయువువలె సంకల్పసిద్ధి కలవాడు, బ్రహ్మస్వరూపుడు అగును.

ఓంకార ధ్యానంచే ఈ లోకంలో ఉన్నంతకాలం కోరిన కోర్కెలు నెరవేరతాయి. అంత్యకాల ధ్యానంచే బ్రహ్మస్వరూపం కల్గి నిత్యానందాన్ని పొందుతాడు.

శ్లో॥ క్షరంతి సర్వా వైదిక్యో జుహోతి యజతి క్రియాః ।
అక్షరం దుష్కరం జ్ఞేయం బ్రహ్మచైవ ప్రజాపతిః॥

వేదవిహితములైన హోమయాగ రూపములగు క్రియలన్ని నశించుచున్నవి. ఓం - అను అక్షరము బ్రహ్మప్రాప్తి హేతుభూతమగుట వలన నశింపదు. ప్రజలకు అధిపతి ఈ బ్రహ్మమే. ఈ బ్రహ్మస్వరూపమే ఓంకారముగ బ్రహ్మ ప్రతిపాదిక మగుటచే - ఓంకారమే బ్రహ్మము.

బ్రహ్మత్వమగుటచేత, బ్రహ్మత్వ ప్రతిపాదకత్వమగుటచేత — ఓంకారమును ధ్యానించుట మోక్షప్రదమని - ఇందలి రహస్యము.

శ్లో॥ అద్యం యత్ త్ర్యక్షరం బ్రహ్మత్రయీ యస్మిన్ ప్రతిష్ఠితా ।
నగుహ్యోఽన్యస్త్రి వృద్వేదో యస్తం వేదస వేదవిత్॥

సర్వవేదములకు మొదటిది. అకార, ఉకార, మకార స్వరూపమైనందున త్ర్యక్షరస్వరూపము. ఈ మూడక్షరములందే మూడు వేదములున్నవి. కావున "ఓం" త్రివృద్వేదము. ఇది పరమార్థ స్వరూపమగు బ్రహ్మమును వివరించునది. పారమార్థికమైనది. దీనిని జపించువారలకి మోక్షప్రదమయింది. కావున రహస్యమైనట్టి ఈ ఓంకార స్వరూపమును, అర్థమును బాగుగ తెలిసికొని ధ్యానించువాడే జ్ఞాని.

ఓంకారమును జపించునపుడు - ఓంకారార్థమైన పరబ్రహ్మ భావము కల్గి ఉండవలెను.

"తజ్జపస్తదర్థ భావనమ్" - అర్థమును తెలిసికొని జపం చేయాలని - పతంజలి మహర్షి పల్కిరి.

కావున "ఓం" - కారం పరబ్రహ్మమని తెలిసికొని, ఏకాగ్ర చిత్తముతో అద్వైతియై ధ్యానించువాడే బ్రహ్మజ్ఞాని. ఓంకారము తర్వా తనే వేదములు వినబడినవి. అన్ని వేదములు ఓంకారముతోనే మొదలు పెట్టబడును. వినబడిన వేదములు మూడు. వినబడని వేదములు అనంత ములు. వేదమునకు శ్రుతి, అమ్నాయమని పేర్లు గలవు [శ్రుతిః స్త్రీవేద అమ్నాయస్త్రయీ] ఇవి ఋక్, యజు, సామములను పేర్లుగల శ్రుతులు శ్రుతి యనగా ధర్మాధర్మములను వినిపించునది. వేదమనగా, ధర్మా ధర్మములను తెలియజేయునది. ఆమ్నాయమనగా తరతరములుగ నేర్వ బడునది. ప్రత్యక్ష ప్రమాణంచేతనుగాని, అనుమాన ప్రమాణంచేతగాని మానవులకు తెలిసికోవడానికి సాధ్యంకాని విషయాలను తెలియజేయు టకే [వేదయ తీతి వేదః] వేదము వినబడింది. ఇది మానవ నిర్మితం కాదు. కావున వేదము అపౌరుషేయము. [పురుషనిర్మితంకాదు]

ఓంకార పరబ్రహ్మకి వేదము ఉచ్ఛ్వాస నిశ్వాసమువంటిది. "అస్యమహతో భూతస్య నిశ్వసిత మేవైతత్ ఋగ్వేదోదయజుర్వేదః సామ వేదః.... ......." ఓంకారము అనాది, నిత్యసత్యము కనుక వేదము కూడ అనాది, నితసత్యమైనది. నిత్యసత్యమై వినబడిన వేదములను వ్యాసుల వారు నాలుగు విభాగములుగా చేసిరి. వేదములను అంతిమభాగములు ఉపనిషత్తులు. ఉపనిషత్తులను కూడ విభాగము చేసిరి. కావుననే వీరిని వేదవ్యాసులని పిలిచెదరు. ఋగ్వేదమునకు 21 ఉపనిషత్తులు, యజు ర్వేదమునకు 109 ఉపనిషత్తులు, సామవేదమునను 1000 ఉపనిషత్తులు అధర్వణ వేదమునకు 50 ఉపనిషత్తులు ఉన్నవి. నాలుగు వేదము లందలి ఉపనిషత్తులు కలసి 1180 గలవు. వీనిలో 108 ఉపనిషత్తులను ఏరి శ్రీరామచంద్రమూర్తి తన భక్త శిఖామణియైన శ్రీఆంజనేయస్వామికి బోధించిరను గాథ కలదు. ఇందును ముఖ్యాతి ముఖ్యములైన ఉప నిషత్తులు పది. అవి ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య,

తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యకములు. వీటికి శ్రీశంకర భగవత్పాదులు అమూల్యమైన భాష్యం రచించిరి. వాటియందు బ్రహ్మ విద్య, దానికి సంబంధించిన విషయములు బోధింపబడినవి. ఈ పది ఉపనిషత్తులలోను మాండూక్యము ఉత్కృష్టమైనదిగా చెప్పుదురు: అందు ఓంకారమును గూర్చియే చెప్పబడినది. కారణము. సమస్త విజ్ఞానమునకు, సృష్టిస్థితి, లయాలకు. - ఇది అది యననేల ? - అన్నిటికి ఓంకారమే మూలమనియు, విదేహముక్తికి కారణమనియు ఇందు నిరూపింపబడినది. ఈ ఉపనిషత్తులన్నిటికంటె పరిమాణముచే చిన్నవి. విషయ గాంభీర్యముచే ఇంతటి గొప్పది మరొకటి లేదు. మాండూక్యోపనిషత్తునకు సాటియైనది ఒక్క మాండూక్యోపనిషత్తుయే. ఇందు 12 మంత్రములు గలవు ముక్తినిగోరువారు ఈ ఒక్క ఈ ఉపనిషత్తునందలి అర్థమును గ్రహించి సాధించిన చాలునని ముక్తికోపనిషత్తులోగలదు.

"ఓంకారతత్త్వము పరబ్రహ్మప్రాప్తికి సాధనము. ఇది తెలిసికొని సాధించిన సాధకుడు విదేహముక్తుడగును." — ఇదే ఇందలి పరమ రహస్యము. ఇందలి అద్వైతత్త్వమును విపులీకరించుటకై శ్రీ శంకర భగవత్పాదుల పరమగురువులు శ్రీ గౌడపాదాచార్యులవారు 215 కారికలు రచించిరి. ఉపనిషత్సారమే భగవద్గీత. 1180 ఉపనిషత్తులన్ని ఆవుల వంటివి. పాలుపితుకువాడు శ్రీకృష్ణమూర్తి. అర్జునుడుదూడ. గీతామృతమే పాలు. సద్బుద్ధిగలవాడే ఆ అమృతమనే పాలుత్రాగి ముక్తిని పొందును. కావున గీత ఉపనిషత్సారము. గీతాసారము "ఓం" కారమని శ్రీకృష్ణభగవానులే చెప్పిరి. పరబ్రహ్మకు ఓం, తత్, సత్ అను మూడు పేర్లు గలవని గీతావాణి కావుననే ఏ కర్మలాచరించినను ఓంకారముతో ప్రారంభించి, ఓం తత్సత్‌తో పూర్తిచేయుచుందురు కొందరు "ఓంతత్సత్ బ్రహ్మార్పణమస్తు" అనికూడా అందురు. ఇందు బ్రహ్మను నాలుగు సార్లు ఉచ్చరించచడమైనది. ఓం, తత్, సత్, బ్రహ్మ - ఇవి బ్రహ్మ పర్యాయ వాచక

ములు. 'అర్పణమస్తు' అనునదికూడా శబ్దబ్రహ్మమే. ఈ రీతిగా, ఓం కారము విదేహముక్తికి కారణము. ఇదే మోక్షము నిచ్చునది. కావున మోక్షవిద్య బోధించునవే ఉపనిషత్తులనిరి గురువు సమీపంలో కూర్చుని రహస్యంగా నేర్చుకొనే విద్యయని, ఆత్మ తత్త్వముగల విద్యయని మరి రెండర్థములుకూడ ఉపనిషత్తనుమాటకు చెప్పిరి. ఉపనిషత్తులు అద్వైత ప్రతిపాదికములు, బ్రహ్మవిద్యా సాధనములు. బ్రహ్మ విషయమునే తెలిపినవి బ్రహ్మసూత్రములు. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, గీతాశాస్త్రము ఈ మూడింటిని ప్రస్థానత్రయమందురు. వీటిని చదివి - ఇందలి పరమార్థమును గ్రహించినచో, ముక్తికి సాధనము ఒక్క "ఓం" కారమనియే తెలును. కావున ప్రస్థానత్రయసారము - ఈ "ఓంకార దర్శనము".

"ఓంకారమే పరబ్రహ్మ" మని - బ్రహ్మసూత్రములందుగల అక్షరాధికరణమున నిరూపింపబడినది.

ఈ ప్రపంచమునగల 84 లక్షల జీవరాశులలో మనుష్యజన్మ పూర్వజన్మ సుకృత విశేషముచే లభించును. ఈ మానవజన్మచే ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థములను సాధించుకొనవచ్చును. ముఖ్యముగా మోక్షప్రాప్తినిచ్చునది ఈ మానవజన్మ యొక్కటే. మానవుడై జన్మించినందుకు సంతోషించి వేదవిహితములైన సత్కర్మలాచరించవలెను. వేదవాక్యముల సమన్వయముచేతను, యుక్తుల సహాయము చేతను, ప్రపంచం అనిత్యం అని తెలిసికోవాలి. సత్యమైంది పరమాత్మ. సమస్త జీవరాశి సృష్టి - అన్నంవల్ల ఏర్పడుతోంది. అన్నం - ఔషధాల వలన. ఓషధులు పృథివివలన పుడుతున్నాయి. పృథివిలో అయిదు గుణాలున్నాయి. ఈ పృథివి నీటినుండి పుట్టింది. నీటికి నాలుగు గుణాలున్నాయి. ఈ నీరు అగ్ని [తేజస్సు] వలన పుట్టింది. అగ్నికి మూడు గుణాలున్నాయి. ఈ అగ్నివాయువునుండి పుట్టింది. ఈ వాయువులో

రెండు గుణాలున్నాయి. ఈ వాయువు ఆకాశంనుండి పుట్టింది. ఆకాశంలో ఒకేఒక గుణమున్నది. ఈ రీతిగా శబ్దమే గుణముగాగల ఆకాశభూతమే విశాలవిశ్వమునకుకూడ ఒకేఒక అధారమున్నది. అదే ఓంకారము. అక్షరము ఆకాశమునకుకూడ ఆధారమని చెప్పబడినది. [అక్షరమమ్బరాన్తధృతేః] ఓంకారోపాసన పరబ్రహ్మోపాసనయే యని శ్రుతి. "ఓం ఇత్యేతదక్షరం"

సూర్యచంద్రులు ఈ అక్షరముయొక్క అజ్ఞచే ధరింపబడియున్నారు. ["ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌతిష్ఠతః"] ప్రపంచధారణము ఆజ్ఞారూపము. సమస్తమును ఆజ్ఞాపించునది ఒక్క ఓంకారమే. ఈ అక్షరము పరబ్రహ్మ భిన్నమగు పదార్థముకాదు. ఈ అక్షరము పరునిచే చూడబడదు. తాను చూచును. ఈ అక్షరం కంటె అన్యుడగు ద్రష్టలేడు. అట్టి మహత్తరమైన అక్షరము ఓంకారము. అదే బ్రహ్మ. దీనినెఱింగినవాడు బ్రహ్మమే అగును. "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" బ్రహ్మజ్ఞానమువలననే పరమైన స్థానము లభించును. ఈ రీతిగా బ్రహ్మసూత్రములన్నియు బ్రహ్మజ్ఞానమునుపదేశించుచున్నవి. ఇదే జీవబ్రహ్మైక్యబోధ. ఇదే తత్వం. పరమాత్మ జీవాత్మయేం అను వేదాంతార్థమే గీతయందుకూడ చెప్పబడినది. గీతయందుగల 18 అధ్యాయములలో మొదటి 6 అధ్యాయములలో - ఆత్మ ఎన్నడును పుట్టుటలేదు, చచ్చుటలేదు. ఎపుడు ఉండునది. స్థిరమైనది. శాశ్వతుడు పురాణపురుషుడు శరీరము నశించినను నశింపనివాడు. ఆత్మను ఆయుధధాలేమీ ఛేదింపజాలవు. అగ్ని దహింపలేదు. నీరు తడపలేదు. గాలి ఎండింపలేదు. ఆత్మ నాశనము లేనిది. ఆత్మ సర్వవ్యాపి, ఇంద్రియములకు కనబడదు. ఆత్మ ఎన్నడును చంపబడదు - ఈ రీతిగా ఆత్మ స్వరూపము చెప్పబడినది. నేను [పరమాత్మ] సమస్త ప్రపంచ ఉత్పత్తికి వినాశనానికి కారణభూతుడను. నాకంటె వేరుగ మరొకటి లేదు.

దారమందు మణులవలె నాయందు ఈ సమస్త ప్రపంచం కూర్చబడింది. సమస్తప్రాణుల హృదయమందున్న ప్రత్యగాత్మను నేనే. అని విశ్వరూపమును చూపించెను. ఈ రీతిగా పరమాత్మ స్వరూపమిందు బోధింపబడెను చివరి ఆరు అధ్యాయములందు - సమస్త ప్రాణులందున్న క్షేత్రజ్ఞునిగ నన్ను తెలిసికొనుము. ఆ రీతిగ తెలిసికొనుటయే జ్ఞానము. నాయందున్న అంశ జీవలోకమందు జీవుడైయున్నాడు. జీవుడు సాక్షాత్, దేవుడే. భక్తిచే మనుజుడు నేనెంతటివాడనో, ఎట్టివాడనో తెలిసికొనుచున్నాడు. ఈ రీతిగ నన్ను [ఓంకారమును] తెలిసికొనిన తర్వాత నాయందు ప్రవేశించును. అనగా జీవుడు తత్త్వజ్ఞానముచే భక్తికల్గి, భక్తిచే జ్ఞానము, జ్ఞానము కలుగుటచే పరబ్రహ్మమైన ఓంకారమందలి తురీయమైన నిశ్శబ్దమును ధ్యానించి మోక్షమును పొందును. ఈ రీతిగ ఇందు జీవబ్రహ్మల అభేదము బోధింపబడినది. ఇదే 'తత్త్వమసి' అను మహావాక్యార్థము. ఇదే భగవద్గీతా రహస్యము. ఈ రీతిగ జీవబ్రహ్మైక్య బోధయే ఉపనిషత్తులందును, ఉత్తరమీమాంసా శాస్త్రములందును, భగవద్గీతయందును ప్రబోధింపబడినది. గీతయందుగల మూడు షట్కములందును క్రమముగా కర్మ, భక్తి, జ్ఞానబోధ చేయబడినది. ఇది వేదవేదాన్త యోగ శాస్త్రాదిసారము. ఓంకారదర్శనమే - ఆత్మ దర్శనము. జ్ఞాననేత్రము మాత్రమే ఈ ఆత్మను దర్శించగలదు. సర్వవ్యాపకుడైన సచ్చిదానంద పరమాత్మను జ్ఞాననేత్రుడే దర్శింపగలడు. ప్రకాశించు సూర్యుని గ్రుడ్డివాడు చూడలేడు. అట్లే అజ్ఞాని ఆత్మను చూడలేడు. కావున ప్రతిజీవి అజ్ఞానమును తొలగించుకొని, జ్ఞానియై - జ్ఞాననేత్రముతో ఆత్మను దర్శించి ముక్తి పొందాలి.

దేవుడు కనిపించలేదని అరిస్తే కనపడడు, శ్రమిస్తే కనబడ తాడు పూలదండను చూచి దారము కనబడ్డంలేదు కదా, కాబట్టి ఇందులో దారంలేదనే వాడికెంతతెలివిఉందో. పై వాడికి అంతే తెలివి ఉంది. పైగా ఈ పూలన్నీ తీసెస్తే మిగిలేది దారం. ఈ పూలన్నీ శరీరా ల్లాంటివి. ఇవన్నీ తొలగిస్తే మిగిలేది ఆత్మ ఒక్కటే. అయితే ఇన్ని దేహా లున్నాయి గదా ? మరి ఇన్ని ఆత్మలులేవే ? అని అంటే - పూలదండలో దారం ఒకటే ఉంటుంది. కాని పూవుకొక్కొక్కటి చొప్పున ఉంటుందా ? అంటే ఒకే దారాన్ని ఆధారం చేసికొని ఎన్నో పూలుంటాయి. ఆ రీతిగానే పరమాత్మ ఒక్కడే అని గుర్తించి, ధ్యానించి ప్రతి ఒక్కరు తరించాలి.

సూర్యకిరణాలెన్నో ఉన్నాయంటారు. కవులుకూడా వేయి కిర ణాలు కలవాడు[సహస్రాంశుః]అన్నారు.చాలా కిరణాలు కలవాడు,కాంతు లొలికేవాడని అన్నారు, ఈ రీతిగా సూర్యకిరణాలెన్నో ఉన్నాయని విశ్వ వ్యాప్తిగా అంటున్న విషయం, కాని సూర్యుడొక్కడే ఉన్నాడు,సూర్యుడు లేకుండా కిరణాలు లేవు. అయినా సూర్యుడు వేరు కాంతివేరు కాదు. సూర్యుడే కాంతి నిలయం అని తెలిసికొన్నవాడే విజ్ఞాని. అదె రీతిగా, ఎన్నో జీవరాసులుంటున్నట్లు అజ్ఞాని ఊహిస్తాడు. జ్ఞాని - ఉన్నదొక్కడే అని ఊహిస్తాడు. విద్యావినయసంపన్నుడైన బ్రాహ్మణుడు, గోవు, ఏనుగు కుక్క మొదలగు సర్వప్రాణులందు ఉన్నది ఒక్క ఆత్మయేనని జ్ఞానులే తెలిసికోందురు. వారే మునులు. వారే ఓంకారమును శివ స్వరూపముగా తెలిసికొందురు.

కాలము అతి త్వరితముగ వెళ్ళుచున్నది. ఉన్న కాలమును సద్వినియోగము చేసికోవాలి. ముక్తిప్రదాత ఒక్క పరబ్రహ్మయే ఓం కారము అని తెలిసికొని నిరంతరము దైవధ్యానంతో కాలం గడిపినవాడే జ్ఞాని. ఆతని జీవితమే ధన్యము. కావున, అనంతమాత్ర గల్గిన ఓంకార మును ప్రతిక్షణము ధ్యానించును.

# ముక్తికి నిదర్శనము - ఓంకార దర్శనము

శ్లో॥ స్మరణాత్కీర్తనాద్వాపి శ్రవణాచ్చ జపాదపి ।
బ్రహ్మ తత్ప్రాప్యతే నిత్యం ఓ మిత్యే తత్పరాయణమ్॥

నిత్యము ఓంకారము స్మరించాలి, కీర్తించాలి, వినాలి [శ్రవణము], జపించాలి. ఈ రీతిగా చేసే బ్రహ్మ ప్రాప్తి కల్గుతుంది. "ఓం" అను ఏకాక్షరమే ముక్తికి ముఖ్యమగు సాధనము.

స్మరణ, కీర్తన, శ్రవణ, జపాదులలో ఏ ఒక్క మార్గం అవలంబించినా బ్రహ్మప్రాప్తి కల్గుతుంది. నాలుగు మార్గాలు అవలంబించిన వారు సాక్షాత్తు "ఓం"కార స్వరూపులై, జీవన్ముక్తులై, విదేహముక్తి పొందుతారు. కావున, ఓంకారస్వామి దర్శనమే - మన - ముక్తికి నిదర్శనము.

ఓంకారమును స్మరించవలెను. నిరంతరము "ఓం, ఓం' ఓం .......... అనుచు స్మరించవలెను. ఓంకారార్థమునే కీర్తించవలెను. ఓంకారమును గూర్చిన గ్రంథములు చదువవలెను. ఆ గ్రంథములను పూజించవలెను. పవిత్ర భావముతో చూచి, అందలి విషయమును నిత్యము పారాయణవలె చేయవలెను. నిత్యము ఓంకార గ్రంథములను వినవలెను. ఓంకారమును గూర్చి తెలిపిన గ్రంథరాజములను చదువలేని వారు చదివించుకొని వినవలయును. అందలి అర్థము గ్రహించి నిరంతరము "ఓం" అని మనసా, వాచా, కర్మణా జపించవలెను. ఇదే బ్రహ్మ ప్రాప్తికి సాధనము. ఇట్టి వారలకు ఓంకారదర్శనము - సుదర్శనమే. స్మరణ, కీర్తన, శ్రవణ, జపాదులలో శ్రవణము, స్మరణ, కీర్తనముల మననమనియు, జపమునే నిది ధ్యాసలనియు కూడ చెప్పవచ్చును. ఇది ఒక పద్ధతి.

ఆర్షమతమునకు పవిత్ర గ్రంథములు ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రములు. భగవద్గీత వాటిని ప్రస్థానత్రయముగా ప్రాజ్ఞులు వ్యవహరించెదరు. వీటి వివరణయే పై శ్లోకమునందలి రహస్యము.

ఈశ, కౌన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య బృహదారణ్యకాది ఉపనిషత్తులయందలి అర్థమును గ్రహించవలెను. ఈ గ్రంథములను తానే స్వయముగా చదువుకొని అర్థమును నిర్ణయించరాదు ఉపనిషత్తులను గురూపదేశము పొంది అర్థ విచారణ చేయవలెను. "తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్" - అను ముండకశ్రుతి ప్రమాణము. ఉపనిషత్తులందు తత్త్వమసి సోఽహం, ప్రజ్ఞానం బ్రహ్మ మొదలైన మహావాక్యములున్నవి. ఇవి గురూపదేశము వలననే శ్రవణములగును. వీటి అర్థమును వివరణమును గురువువలన వినుటయే శ్రవణము. జీవబ్రహ్మైక్యమిందు నిరూపితము. గురువుగారి వలన వేదాంత శ్రవణచేసిన, ఉపక్రమ, ఉపసంహార, అభ్యాస, అపూర్వతా, ఫల, అర్థవాద, ఉపపత్తులనే ఆరు విధాల తాత్పర్య లింగాలచే ఆత్మయే పరమాత్మ అనే బ్రహ్మజ్ఞానం కల్గుతుంది. అదే "అహం బ్రహ్మాస్మి" అనే జ్ఞానము. గురూపదేశం వలననే ఈ జ్ఞానం కల్గుచున్నది. కావున శ్రవణమే శ్రేయోదాయకము.

బ్రహ్మ పరిపూర్ణుడు. [ పూర్ణము = అనంతము = Infinite ] పూర్ణమైన బ్రహ్మనుండి పూర్ణమైన సృష్టి పుట్టింది. అయినా బ్రహ్మ పూర్ణంగానే ఉంది. అనగా ఉన్నవస్తువు ఒక్కటే అదే పూర్ణము రజ్జు సర్పభ్రాంతివలె సృష్టి భ్రాంతి ఉన్నదొక్క పూర్ణబ్రహ్మమే. ఇది త్రికాలములందు మార్పులేని నిత్యసత్యము ఈ అద్వైత సిద్ధాంతమును మధురాతి మధురమైన మాటలమూటలతో వ్యక్తముచేసిన శాంతి మంత్రము అందరిచేతను చదువదగినది.

పూర్ణమదః పూర్ణమిదమ్ పూర్ణాత్ పూర్ణముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥

అది పూర్ణము. అది పూర్ణము. ఆ పూర్ణమునుండి ఈ పూర్ణము పుట్టినది. ఈ రీతి పుట్టినను అది పూర్ణముగానే మిగిలినది. అనగా బ్రహ్మ ఒక్కటే సత్యము.

విశ్వమంతయు బ్రహ్మమే. బ్రహ్మకన్న వేరులేదని గుర్తించాలి. మానవుడు ఈ షణత్రయము విడవాలి. ఇందులోను దారేషణ. పుత్రేషణ కన్న ధనేషణ విడచుట ముఖ్యము - ఎవరి ధనాన్ని వాంఛించరాదు. "మాగృధక స్యస్విద్ధనం...." అని ఈశావాస్యోపనిషత్తులో చెప్పబడింది. ఈ శరీరం భస్మమయినపుడు అమృతమైన వాయువు, నీయందేగల బ్రహ్మను "ఓం" - గా స్మరించి [నేను] ఆచరించిన కర్మలను ముమ్మాటికి "ఓం" - రూపమైన క్రతువుగా స్మరించును. "ఓంక్రతో స్మరకృతగ్ం స్మరక్రతో స్మరకృతగ్ం స్మర" చివరకు అగ్నిదేవుని ప్రార్థించును. ఈ రీతిగా బ్రహ్మబోధ ఈశావాస్యమునందు గలదు. సామవేదమునకు చెందిన కేనోపనిషత్తు "కేతో ప్రారంభింపబడినది. ఇది గురుశిష్య సంవాద రూపము. ఇంద్రియములు, అని కరణ చతుష్టయము, ప్రాణములను ప్రవర్తింపజేయువాడు ఎవడని శిష్యుని ప్రశ్న. "పరమాత్మ" యని గురువు సమాధానము. ఆ పరమాత్మ జ్ఞానంచే మోక్షంగల్గును.

ఈ రీతిగా ఇందు ఆత్మతత్త్వ నిరూపణ, ఆత్మదుర్విజ్ఞేయత్వ ఆత్మజ్ఞాన సాధనాలు, మానవజన్మచే ఈ జ్ఞానము లభ్యమగునని, కావున ఈజన్మను సార్థకము చేసికొని మోక్షము పొందవలెనని చెప్పబడెను. సత్యవ్రతము, బ్రహచర్యము, నిష్కామకర్మానుష్టానము, తపస్సు శమ దమాదులవలన ఆత్మజ్ఞానము లభించునని గురూపదేశము.

బ్రహ్మవిద్యను - యమధర్మరాజు నచికేతుడనే బాలునకు ఉపదేశించిన విషయము కఠోపనిషత్తునందు గలదు. "ఓం"కారోపాసన వలననే బ్రహ్మసాక్షాత్కారము కల్గునన్న రహస్యము ఇందు చెప్పబడినది ఇందలి ఆఖరి మంత్రమును పఠించుట సర్వులకు శ్రేయోదాయకము.

"సహనావవతు, సహనౌ భువక్తు, సహవీర్యంకరవావహై. తేజస్వి నావధీతమస్తు మావిద్విషావహై॥" ఓం శాంతిః శాంతిః శాంతిః॥

ఇది గురుశిష్యుల సంవాద రూపము. చెప్పినవారు, తెలిసికొన్న వారు "ఓం"కార జ్ఞానముచే రక్షింపబడుదురు. ఇద్దరు దివ్యామృత స్వరూపులై వీర్యవంతులగుదురు, తేజ స్వరూపులగుదురు, భేదబుద్ధి నశించి ఏకత్వమే మిగులును. త్రికరణ శుద్ధి కల్గి శాంతి కల్గును.

అథర్వణ వేదమునకు చెందినది ప్రశ్నోపనిషత్తు ఇందు ప్రశ్నలు — సమాధానములు కలవు. కావున దీనిని ప్రశ్నోపనిషత్తు. అందురు. వేదవేత్తలైన సత్యకామాదు లారుగురు, పూజ్యులైన పిప్పలాదా చార్యుని కొన్ని ప్రశ్నలడుగుతారు. వారు, వారిచే బ్రహ్మచర్యము కొంత కాలము చేయించి తర్వాత వారికి సమాధానములు చెప్పి అవిద్యా సాగ రమును దాటించిరి.

"దేనివలన ప్రజలు పుట్టుచున్నారు ?" — అని ప్రశ్నింప — సృష్టి వివరణ చెప్పబడినది. అన్నము ప్రజాపతి [బ్రహ్మ] స్వరూపమని, అన్నమువలననే ప్రజలు పుట్టుచున్నారని సమాధానము చెప్పెను.

సూర్యరశ్మిగల పగలు ప్రాణము. రాత్రి అన్నము రాత్రిం బగళ్ళు - బ్రహ్మస్వరూపము. బ్రహ్మప్రాణసృష్టికి కారణమైనది పగలు కావున పగటి కాలమందు రతిక్రీడ నిషేధింపబడినది. రాత్రి అన్నము ఋతుకాలమందు చేసే రతిక్రీడ బ్రహ్మయొక్క చర్య అని చెప్పబడెను. అన్నమే బ్రహ్మ, అన్నము - జఠరాగ్ని యందుగల వైశ్వానరాగ్ని వలన జరుగు క్రతువు వలన రేతస్సుగా మారును, ఈ రేతస్సు వలనే జీవ రాసులు పుట్టుచున్నవి. కావున ఋతుకాలమందు ధర్మపత్నులతో రాత్రు లందు చేయు రతి బ్రహ్మచర్యముగా చెప్పబడెను. ఇదే ప్రాజాపత్య వ్రతము. ఇట్టివారికి మంచి సంతానము కల్గుటయేగాక మోక్షప్రాప్తి కల్గును.

"శరీరములో గల దేవతలలో గొప్పవారెవరు ?" అను రీతిగా అడిగినది రెండవ ప్రశ్న. "ప్రాణము" — శరీరమునకు ఆధారమని సమాధానము. ప్రాణమే బ్రహ్మయని దేవతలందరు తెలిసికొని, ప్రాణమును స్తుతించిరి.

"ప్రాణము ఎలా పుట్టుచున్నది" ? — మొదలుగా మూడవ ప్రశ్న. ప్రాణము ఆత్మవల్ల కల్గుతోంది. మానవునికి నడవలె ఆత్మకి ప్రాణం ఉన్నదను రీతిగా సమాధానము చెప్పెను. నాల్గవ ప్రశ్న జాగ్రత్ స్వప్న, సుషుప్తి, తురీయావస్థల వివరణ.

సూర్యుడస్తమించగా, ఆతని కిరణమును ఆతనియందేలయించును సూర్యుడుదయించగా బాహ్యమునకు వచ్చునట్లు, స్వప్నమున ఇంద్రియములన్ని మనస్సునందు లయమై, జాగ్రద్దశలో బహిర్గతమగును. ఈ రీతిని మృదు మధురమగు ఉపమానములతో వారికి సమాధానము ఇచ్చెను.

నీటిలోగల ప్రతిబింబము. నీరెండిపోగా, బింబములో కలసినట్లుగా, జీవుడు (ఆత్మ) పరమాత్మలో కలసిపోవునని చెప్పెను ఈరీతిగా విచారణచేసి, జీవాత్మయే పరమాత్మయని నిరూపింపబడినది.

"ఆత్మప్రాప్తికి ఉపాయమేమి?" - అను అతిముఖ్యమైన ప్రశ్న ఐదవది. "ఓం"కారమే. ఆత్మప్రాప్తికి సాధనము. ఓంకారమే పరబ్రహ్మ ఈ రహస్యము తెలిసికొన్నవాడు - ఓంకార ధ్యానంచే కోరిన కోరికలను పొందును. సత్సంతానము కల్గును. మంచి చదువు వచ్చును. సమస్త విద్యలందును ప్రావీణ్యము సంపాదించును. సర్వమహిమలను పొందును పుట్టిన సంతానము బ్రహ్మచర్యాది నియమములు కలవారై, వారు తరించుటయే కాక ఆ వంశమందు పది తరములు అటూ, ఇటూకూడ తరింపజేయుదురన్న సర్వరహస్యములు తెలుపబడినవి. చివరకు, ఓంకార

ఉపాసనచే పరబ్రహ్మ సాక్షాత్కారము లభించును ఇట్టి రహస్యమగు విషయముగల ఓంకారార్థమంతయు విపులీకరించెను. దివ్యామృత స్వరూపమైన ఓంకారమును ధ్యానించిన జ్ఞానులు శరీరాంతమందు మరల పుట్టుక లేనివారై భయములేని శ్రేష్టమైన ఓంకారదర్శనముచే దివ్యామృతత్వమును పొందుదురు – అని ఐదవ ప్రశ్నకు సమాధానము. ఆరవ ప్రశ్నయందు ఆత్మస్వరూపమును గూర్చిన ప్రశ్న. ఆత్మయే పరమాత్మ యనితెలుపబడినది. ఇది ప్రశ్నోపనిషత్తు నందలి సారాంశలేశము.

ఏ వస్తువును తెలిసికొంటే సమస్తము తెలియునో, ఆ వస్తువును గూర్చిన విద్య – ముండకోపనిషత్తు నందుపదేశింపబడినది. ఆ విద్య పర విద్య. ఈ విద్య తెలిసికొనినచో సమస్తము తెలియును. విద్య రెండు రకాలు. పర విద్య, అపరవిద్య. పరవిద్య ఓంకార బ్రహ్మమును గూర్చి తెలుపునది. ఓంకారమును గూర్చిన బ్రహ్మవిద్యను మొదట వినినవాడు సృష్టికర్త. సృష్టి అంతయు "ఓం" నుండియే పుట్టుచున్నది. ఇతర సహాయంలేక సాలెపురుగు తనలోంచి దారము సృజించి, ఎటుల మరల తన లోనికి తీసికొనుచున్నదో, మానవు నుండి కేశములు రోమములు ఏరీతిగా పుడుతున్నాయో ఆ రీతిగా అక్షరమగు పరబ్రహ్మ నుండి సృష్టి పుట్టుచున్నది. ఓంకార రూపమగు అక్షరబ్రహ్మను తెలిసికొన్నవారే తత్త్వ జ్ఞానము కలవారు. ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వణవేద, శిక్ష, వ్యాకరణ, ఛందో నిరుక్తి జ్యోతిష కల్పాదులను అపరవిద్య, అందురు. వీటివలన ఓంకారార్థము తెలియును, పరావిద్య బోధకమగు ఉపనిషత్తుల వలన బోధింపబడిన విజ్ఞానముచే బ్రహ్మప్రాప్తి కల్గును. ఓషధులకు పృథివి ఆధారమైనట్లు, సృష్టికి బ్రహ్మ (ఓం) ఆధారము. ఈ అక్షర స్వరూపుడగు పరమాత్మ సర్వజ్ఞుడు, సర్వవేత్త. మాయాశక్తిచే ప్రపంచం సృజింపబడు చున్నది. సమస్త జీవుల అనుభవాలకు వారల పూర్వకర్మయే కారణము. అపర విద్యయే మోక్షదాయనము.

బ్రహ్మమును పొందుటకు మనస్సే ముఖ్యసాధనము. ఓంకారము ధనస్సు జీవుడు బాణము. బ్రహ్మము లక్ష్యము. చిత్త ఏకాగ్రముతో లక్ష్యమును కొట్టిన బ్రహ్మము సిద్ధించును. విషయసుఖాల్ని వదలి, ఏకాగ్రమైన మనస్సుతో ఓంకారమునే ధ్యానించినవాడు జ్ఞానముపొంది ముక్తుడగును. సమస్తమూ బ్రహ్మమని విపులీకరింపబడినది. విశాలవిశ్వమున ఉన్న దొక్క ఓంకార బ్రహ్మమే. బ్రహ్మవేత్త సాక్షాత్తు బ్రహ్మమే. కావున అట్టి మనుజుని ఉపాసన బ్రహ్మోపాసనమే అగును.

కాముకుడు [ప్రాపంచిక విషయములను కోరువాడు] మోక్షము పొందలేడు. సమస్త కామాన్ని త్యాగంచేసి, ఆత్మకాముడగువాడే, విషయ కామాలు నశించడంచేత, ఆత్మజ్ఞానం కలిగి మోక్షం పొందునని ఉపనిషత్తులందును, ఉపనిషత్సారమైన గీతయందును చెప్పబడినది. గీతా గీతా - అంటే తాగి తాగీ - అని అనియు, తాగీ అనగా సమస్త కామాల్ని త్యాగంచేసినవాడే ఆత్మని తెలిసికోగ్గలడని - ఆ బ్రహ్మ విద్యనే ప్రస్థానత్రయం బోధించింది.

బ్రహ్మ జ్ఞానోదయమువలన శరీరధారులకు ముక్తి కలుగును. శరీరమున్నను అది మిథ్యా మాత్రము. కావున వారు జీవన్ముక్తులు. వారు శరీరము వదలిన తర్వాత విదేహముక్తులగుదురు. జీవన్ముక్తులు బ్రహ్మజ్ఞానులే. అట్టి బ్రహ్మజ్ఞాని బ్రహ్మయే. వారివంశమందు బ్రహ్మవేత్తలు జన్మింతురు. అట్టి మంచి సంతానము శోకములను దాటి, దివ్యామృత రసాస్వాదన తత్పరులై జీవన్ముక్తి పొందెదరు.

జీవన్ముక్తులైనవారు మరెందరికో బ్రహ్మవిద్య నుపదేశించి వారలనుగూడ జీవన్ముక్తులను చేయుదురు. జనకమహర్షి - శుకమహర్షికి బ్రహ్మోపదేశము గావించినట్లు పురాణగాథవలన తెలియుచున్నది.

అథర్వణ వేదమునకు చెందిన మాండూక్యోపనిషత్తు ఇందు 12 మంత్రములు గలవు. ఈ 12 మంత్రములందు సర్వులకు తెలియునటుల "ఓం" కార తత్త్వము విపులీకరింపబడినది. "ఓం" కారమే పరబ్రహ్మ ప్రాప్తికి ఏకైక సాధనమని, ఓంకారము తెలిసినవాడు ఆత్మ స్వరూపము పొందునని - ఇందలి హృదయము. ఇందలి అద్వైత తత్త్వము, ఆగమ వైతథ్య, అద్వైత, అలాత శాంతి అను నాలుగు ప్రకరణములలో శ్రీ గౌడ పాదులవారు 215 కారికలుగా రచించిరి. ఇందు ఓంకారతత్త్వమును, దానిని తెలిసికొన్న సమర్థులు జీవులే అని విపులీకరింపబడినది.

కృష్ణ యజుర్వేదములోని తైత్తిరీయశాఖకు చెందినది - తైత్తిరీయోపనిషత్తు ఇందు శీక్షావల్లి, బ్రహ్మవల్లి, [ఆనందవల్లి] భృగువల్లి, అను పేర్లతో మూడు వల్లులుగలవు. బ్రహ్మబోధ - విపులమగు రీతిలో వివరింపఁబడినది. బ్రహ్మవిద్యకు అవసరమగు ఉపాసనలన్ని శీక్షలో వివరింపబడినవి. ఇందు 5 విధములయిన సంహితోపాసన, హితబోధలు గలవు. ప్రణవోపాసనచే పరమాత్మ జ్ఞానము కల్గునని, తద్వారా మోక్ష ప్రాప్తి యని, వేదసారము "ఓంకారమేనని ఇందు స్పష్టము చేయ బడినది. ఓంకార తత్త్వము తెలిసినవాడే బ్రహ్మవేత్తయని, బ్రహ్మవేత్త బ్రహ్మానందము పొందునని, అతడు నిర్భయుడని నిరూపింపబడినది. వరుణుడు తన పుత్రుడైన భృగువు కోరికపై బ్రహ్మవిద్యను బోధచేయు విధానము తెలుపబడినది. భృగువు తపస్సుచేసి – చివరకు బ్రహ్మస్వరూపమును తెలిసికొనెను.

ఋగ్వేదమునకు చెందినది - ఐతరేయోపనిషత్తు. ఇందు ఋగ్వేదమునందలి మహావాక్యమగు "ప్రజ్ఞానం బ్రహ్మ" అను వివరణ కలదు. ఆత్మవిద్య తెలుపబడినది, సజాతీయ, విజాతీయ, స్వగత భేద ములు లేనిది ఆత్మ. ఆత్మనుండి నామరూపాత్మకమైన సృష్టి బయటకు వచ్చినది.

ఆత్మయే మాయచేత నామరూపాత్మకముగ వ్యక్తమయి ప్రపంచ రూపమున వెలసినది. ఈ రీతిగా ఆత్మయొక్క ఏకత్వము నిరూపింప బడినది. సృష్టికి కారణమైన మాయ ఆత్మశక్తిగా నిరూపింపబడినది. పరమేశ్వరుడు జ్ఞానస్వరూపుడు. కర్తృత్వభోక్తృత్వాదులుకల జీవుడే ప్రజ్ఞాస్వరూపుడు. ఆతడే బ్రహ్మ. చైతన్య స్వరూపమగు ఆత్మను తెలిసి కొనుటయే 'ప్రజ్ఞానం బ్రహ్మ" బ్రహ్మజ్ఞానము వలన దివ్యామృతస్వరూపు లగుదురు. అనగా మరల పుట్టుకలేనివారై శాశ్వత బ్రహ్మానందం పొందుదురు.

సామవేదమునకు చెందినది — "ఛాందోగ్యోపనిషత్తు" సామ వేదమందలి - "ఓంతత్వమసి" అను గురూపదేశ మహావాక్య వివరణము ఇందుగలదు. జీవబ్రహ్మల ఐక్యము ఉద్దాలక మహర్షి తన కుమారుడైన శ్వేతకేతువునను, "తత్త్వమసి" అను మహావాక్యముచే అనేక దృష్టాంతములతో బోధించెను. బ్రహ్మ ఒక్కటే సత్యమైనది. అసత్యమైన పదార్థము తెలిసికొనుటచే జగత్తంతయు తెలియును. అసత్యమైన జగత్తంతయు - సత్యపదార్థముకన్న వేరుకాదు. కావున ఓంకారబ్రహ్మను తెలిసికొన్నచో సమస్త విజ్ఞానము తెలియును. కావున "ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానేన సర్వవిజ్ఞానం" అను ప్రతిజ్ఞ విపులీకరింపబడినది.

సర్వవేదవ్యాప్తమైనది ఓంకారము. ఉద్గీథవాచ్యమైన ఓంకారమును ఉపాసించాలి. ఓం - అని ఉద్గాత గానము చేయుచున్నాడు ఇట్టి "ఓం"కారమును గూర్చి విపులముగా ఇందు వివరింపబడినది.

"ఓం — ఇత్యే తదక్షర ముద్గీద ముపాసీత,
ఓ మిత్యుద్గాయతి తస్యోపవ్యాఖ్యానమ్ ॥"

"ఓం" – అనునది జోతిర్మయి. బ్రహ్మ - అని, సమస్త ప్రపంచము ఓంకారముచేతనే వ్యాపింపబడియున్నదని — ప్రజాపతి చాలా

కాలము తపస్సు చేసి తెలిసికొనెను. విశాల విశ్వములో సారమైనది ఏదని - బ్రహ్మ ధ్యానించెను. ధ్యానము చేయగా, చేయగా మూడు వేదముల సారమని తోచెను. ఆ మూడింటిలో సారమైనది ఏదని మరల ధ్యానించగా, భూః, భువః, సువః - అను మూడు వ్యాహృతులు అని తెలిసినది, వీటియందును సారభూతమైనది తెలిసికొనగోరి మరల ధ్యానించగా, "ఓం" — అనునది ఒక్కటే సారమైనది అని తెలిసికొనెను. కావున సర్వము — "ఓమ్" అను ప్రణవమే.

సంసారమునకు మూలము కామము. కామము లేనివారికి జన్మాంతరము లేదు. అతడే ఆత్మసాక్షాత్కారము పొంది బ్రహ్మయగును జ్ఞానమార్గము సులభ మార్గములో చెప్పబడినది. జ్ఞాని ఆత్మతత్త్వము తెలిసికొనును. అట్టి వ్యక్తి నిత్యశుద్ధబుద్ధ స్వభావుడు, శాశ్వత బ్రహ్మానందస్వరూపుడు· ఆత్మ — దివ్యామృత స్వరూపమును జ్ఞానము కలవాడే - దివ్యామృత స్వరూపుడై ముక్తుడగును.

వేదము నిత్యము చదువవలెను. వేదమందు చెప్పబడిన యజ్ఞ దాన, తపస్సులను కర్మలను చేయవలెను. ఇవన్నీ నిష్కామబుద్ధితో చేసిన చిత్తశుద్ధి కల్గును· అట్టి ఆత్మజ్ఞాని దివ్యామృతస్థితి పొందును. అదియే మోక్షము. ఈ రీతిగా బ్రహ్మవిద్య[illegible] యాజ్ఞవల్క్యులు జనకున కుపదేశించి, వారిని బ్రహ్మవేత్తను జేసిరి· ఈ ఉపనిషత్తునందలి పంచమ బ్రాహ్మణమున, యాజ్ఞవల్క్యమహర్షి తన భార్య మైత్రేయికి ఉపదేశించిన విషయము కలదు.

ధనముచే మోక్షమురాదని, తెలిసికొని, మోక్షవిద్యనుపదేశింపుమని అడిగిన మైత్రేయికి — యాజ్ఞవల్క్యులు - ప్రేమయే దైవము అని తెలిపెను. నిత్యసత్యమైన ప్రేమ ఆత్మ ఒక్కటే అని తెలిసికోవాలి. ఈ రీతి ఆత్మను తెలిసికొని, శ్రవణ, మనన [illegible]ధిధ్యాసలు చేయాలి. వీటి వలన ఆత్మసాక్షాత్కారము కలుగు[illegible] [illegible] తెలిపిన, మిగిలిన సమస్తము

తెలియును. ఆత్మకన్న భిన్నముగా ఏదియులేదు. వీణ మీటగా ధ్వనులు పుట్టును. ఈ స్వరములు వీణమీటగా వచ్చిన ధ్వనులేగాని వేరు ధ్వనులు కావు. అట్లే సమస్త సృష్టి ఆత్మకన్న భిన్నముకాదు. వీణలేనిచో ధ్వనులు లేనట్లు ఆత్మలేనిచో సమస్త సృష్టియులేదు. వీణలేని ధ్వనులుండవు అట్లే ఆత్మలేని సృష్టిలేదు. వీణ ఉన్నా మీటనిచో ధ్వనులు పుట్టకపోవచ్చును అట్లే ఆత్మ ఉన్నా సృష్టిలయమగును. అపుడు ఆత్మయే ఉండును. ఈ రీతిగా ఆత్మ నిత్యసత్యమైనది. జలములన్నింటికి సముద్రమొక్కటియే గమ్యస్థానము [నదీనాంసాగరోగతిః] ఆ రీతిగ జగత్తుకు ఆత్మ ఒక్కటియే స్థానము. ఆత్మ వినావిశ్వంలేదు. ఆత్మలోనే విశ్వం ఉన్నది. కనబడే ప్రపంచం అంతా, ఆత్మ తెలియగానే నశించును. అదే - ఆత్మ సాక్షాత్కారము. అదే ఓంకారదర్శనము.

ఇదే దశోపనిషత్సారము. ఇందలి విషయములనే గ్రహించి బ్రహ్మసూత్రములనుపేర శ్రీ వ్యాసభగవానులు వ్యాఖ్యానించిరి.

"ఆత్మా వాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యోమన్తవ్యో నిదిధ్యాసి తవ్యః" - అను దానిచే, ఆత్మకు దర్శన, శ్రవణ, మనన, నిది ధ్యాసలు విధింపబడినవి. కావున ఉపనిషత్తులు గురూపదేశము వలన తెలియవలెను. దానివలన జ్ఞానము కల్గును. కావున, ఉపనిషత్తులు శ్రవణ ప్రస్థానము. బ్రహ్మ సూత్రములు - మనన ప్రస్థానము. బ్రహ్మసూత్రములు మననం చేయవలెను. దీనివలన జీవబ్రహ్మైక్యము సిద్ధించును.

"ఓం ఇత్యే తదక్షర ముద్గీథ ముపాసీత" - ఉద్గీథ వాచ్యమైన ఓంకారమును ఉపాసించవలెనను ఛాందోగ్య శ్రుతియందలి ఉద్గీథము విశేషణమను విషయము బ్రహ్మసూత్రముచే స్పష్టపడుచున్నది. వేద మందెల్ల "ఓం"కారము వ్యాపించి యున్నది. కావున ఉద్గీథమనుమాట దాని విశేషణమనుటయే సమంజసము. "వ్యాపే[illegible]మంజసమ్" సాధన

చతుష్టయానంతరము బ్రహ్మ విచారము చేయవలెను. "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" దేనినుండి యీ భూతాలు జన్మించుచున్నవో, పుట్టిన భూతాలు దేనివలన జీవించుచున్నవో, ప్రళయకాలంలో దేనితో తాదాత్మ్యమును పొందుచున్నవో అది పరబ్రహ్మము. "జన్మాద్యస్యయతః" ఈ రీతి బ్రహ్మనుగూర్చి, ఉపనిషద్వాక్యములను వ్యాసులవారు బ్రహ్మసూత్రము లందు వ్యాఖ్యానించిరి. ఈ విషయము తైత్తిరీయములోనిది.

"యతోవా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి
యత్ప్ర యన్త్యభిసంవిశన్తి, తద్వి జిజ్ఞాస స్వ తద్బ్రహ్మేతి"

పరబ్రహ్మ వేదమునకు మాత్రమే గోచరము. [తంత్వౌపనిషదం]. బ్రహ్మయొక్కటె సత్యము అది అద్వితీయము, కావున ఏకమేవాద్వితీయం బ్రహ్మ. నానాత్మకముగా ప్రభాసించునదంతా మిథ్యయని "నేహనానాస్తికిఞ్చన" శ్రుతి. కావున వేదమే ప్రమాణముగా గలదని బ్రహ్మసూత్రము. "శాస్త్రయోనిత్వాత్". పూర్వ మీమాంసా శాస్త్రమునందు వేదమంతయు కర్మ కొరకు చెప్పబడినది, కర్మను విధింపని వాక్యము లన్ని నిరర్ధకములని ["అమ్నాయస్య క్రియార్థత్వా దానర్థ్యమత దర్థానం] చెప్పబడుటచే, వేదాంత వాక్యములు కర్మకు సంబంధించినవి కావున ఇవి నిరర్ధకము కావలసి వచ్చును.

ఏ గ్రంథమందైన – దీనికిదే అభిప్రాయమని నిర్ణయింపవలసి వచ్చినపుడు ఉపక్రమము, ఉపసంహారము, అభ్యాసము, అపూర్వత, ఫలము, అర్ధవాదము, ఉపపత్తి మొదలగువాటిచే తాత్పర్య నిర్ణయము చేయవలెను. వాటిచే విమర్శించినచో ఉపనిషత్తులు పరబ్రహ్మము నొక్క దానినే చెప్పును. కావున బాగా సమన్వయించినచో వేదాంత వాక్యములు బ్రహ్మ ప్రతిపాదకములు. ["తత్తుసమన్వయాత్"] పృథివ్యప్ తేజోవాయు

వుల కాధారమైన ఆకాశమునకు కూడ ఆధారమైనది ఓంకారమని, పర మాత్మని ఓంకార రూపముతో ధ్యానించి ఉపాసించవలెనని. చెప్పబడి నది. "అక్షర మమ్బరాన్తధృతేః" ఈ విషయములన్నియు మననముచేయ వలెను.

ఉపనిషత్సారమునే భగవానుడు గీతయందు చెప్పెను."సమస్త కర్మలను వదలి, ఒక్కడైన నన్ను [ఓంకారమును] మాత్రమే శరణు పొందుము. నేను [ఓం] నిన్ను సమస్త పాపముల నుండి విముక్తునిగ జేసెదను, శోకించవలదు. అనుటచే తత్త్వబోధయంతయు ఇందిమిడి యున్నది. మామ్, ఏకం, — నన్ను ఒక్కని మాత్రమే అనుటచే, ఏకా క్షర స్వరూపుడననియు, బ్రహ్మ స్వరూప మొకటేననియు, ఒక్క ఓం కార స్వరూపుడైన పరమాత్మను నమ్మిన చాలుననియు, కావున, సమస్తము వదలి నన్ను ఆశ్రయింపుమని బోధించెను. ఇందు ఉపనిష త్తుల సారమంతయు ఉన్నది. ఇందు పాపము చేయుటచే దుఃఖము వచ్చుననియు, పుణ్యముచే సుఖము, జ్ఞానముచే మోక్షము కల్గుననియు. జ్ఞానమే ఉత్తమోత్తమమైనదనయు నిరూపింపబడినది. పరమాత్మను నమ్మినచో దుఃఖించవలసిన అవసరం లేదు. శోకమును తొలగించుటయే గీతా లక్ష్యము. "అశోచ్యానన్వశోచస్త్వమ్" — అని ప్రారంభించి, శోక రాహిత్యమగు "మాశుచః" అను వాక్యముతో గీతోపదేశము పూర్తి అయి నది. శోకరాహిత్యము, బ్రహ్మానందప్రాప్తియే గీతా లక్ష్యము. ఉపనిష త్తుల సారాంశము కూడ బ్రహ్మానంద ప్రాప్తియే. అదే బ్రహ్మసూత్ర రహస్యము. ఈ ప్రస్థానత్రయమునందలి సారాంశము "బ్రహ్మానంద ప్రాప్తి"యని తేలినది. ఇదే — ఆత్మ సాక్షాత్కారము. ఇదే "ఓం" — కారమందుగల పరమ రహస్యము.

"సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః"

ఈ శ్లోకమును చాలామంది సాధకులు, వైష్ణవులు మంత్రంవలె నిరంతరము జపించెదరు. ఇందు ఓంకారార్ధమున్నది. వేదమందలి మహా వాక్యములకర్థము ఈ శ్లోకరత్నమే. ఈరీతిగా నిధి ధ్యాసా ప్రస్థానము భగవద్గీత. ప్రస్థానమనగా ఆత్మజ్ఞాన సాధనము.ఇవన్నియు ఆత్మతత్వము ను బోధించి - అద్వితీయుడైన బ్రహ్మ ఒక్కడే - అను సత్యమును తెలుపును. "అహంబ్రహ్మాస్మి" అను జ్ఞానము కల్గును. వాడే జీవన్ముక్తుడు ప్రారబ్ధ కర్మ క్షయంకాగా, విదేహముక్తి కల్గును. వాడే బ్రహ్మ. [బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి].

అజ్ఞానం తొలగటంచే ఆత్మ తత్త్వజ్ఞానం కల్గి - మోక్షం ప్రాప్తిస్తుందని, ఒక్క పరమేశ్వరుడే సృష్టి స్థితిలయకారకుడని, ప్రపంచము మిథ్యయని, జీవేశ్వరులకు వాస్తవిక భేదంలేదని బ్రహ్మ భావము - మోక్షమని - శ్రీ శంకరాచార్యుల సిద్ధాంతము. జీవేశ్వరులకైక్యము వీరంగీకరించిరి ఇది అద్వైతమతము.

ప్రపంచము సత్యము. జీవేశ్వరభేదము వాస్తవికమని, జీవుడు అణురూపుడని, తత్త్వత్రయముతోకూడినది విశిష్టాద్వైతము. స్థూల చిదచిద్విశిష్ట - సూక్ష్మ చిదచిద్విశిష్టుల కైక్యమును వీరంగీకరించిరి. ఈశ్వరానుగ్రహంచే వైకుంఠప్రాప్తి కల్గును. ఇదే మోక్షము. ఇది శ్రీరామానుజాచార్యుల సిద్ధాంతము. ఇది విశిష్టాద్వైతము.

జీవేశ్వరభేదం నిరూపించబడింది. [సృష్టి ఉత్పత్తికి కారకుడు పరమేశ్వరుడు] స్థూలసూక్ష్మ చిదచిద్విశిష్ట భేదము నిరూపించుటచే ఇదిద్వైతమతము. ఇది ఆనంద తీర్థాచార్యుల సిద్ధాంతము

ఈ రీతిగనే క్రైస్తవుల మతప్రవక్తయగు క్రీస్తు - పరిశుద్ధాత్మ యొకటి గలదని, అదియే ప్రభువని - సమస్త సృష్టికి కారణభూతమని చెప్పెను.అర్జునుడు దుఃఖించెను కావున ధన్యుడై శ్రీకృష్ణునిచే ఓదార్పబడి

ముక్తిపొందెను. ఈ విషయమందలి రహస్యమే క్రీస్తు - శిష్యులకు బోధించిన ఘట్టములో కలదు దుఃఖపడువారు ధన్యులు, వారు ఓదార్పబడుదురు. [మత్తయి 4వ అ. 4] ఇంగ్లీషులో ఇంతకన్న స్పష్టముగా ఉన్నది.

"Happy are those who mourn
God will comfort them!" (Matthew 5 - 4)

హృదయశుద్ధిగలవారు ధన్యులు. వారు దేవుని చూచెదరు.

"Happy are the pure in heart
they will see God ! (Matthew 5 - 8)

నీతి నిమిత్తము హింసింపబడువారు ధన్యులు!

Happy are those who are persecuted
because they do what God requires! (Matthew 5 - 10)

సత్యం కోసం హింసింపబడినవాడు హరిశ్చంద్రుడు - చివరకు ధన్యుడైనాడు.

ధర్మం - దైవాన్ని నమ్మిన ప్రహ్లాదుడు హింసింపబడి - చివరకు ధన్యుడైనాడు.

క్రీస్తే నీతి నిమిత్తం హింసింపబడి ధన్యుడైనాడు. ఎన్నో బోధలు చేసెను. దేవుని కృపకోసం ప్రార్థనచేయండి. ప్రార్థనచేసేవాడు రక్షంపబడతాడు. [రోమా 10 : 13] పాపాలు చేయకుండా ఉంటే దేవుని మహిమ కల్గుతుంది. "అందరును పాపముచేసి దేవుడనుగ్రహించు మహిమను పొందలేక పోవుచున్నారు." [రోమా 3 : 23] అని ఎన్నో ధర్మాలు చెప్పబడినవి. ఇంతకీ క్రీస్తు చెప్పింది - దైవాన్ని నమ్మండి. పరిశుద్ధాత్మ

ఒకటి ఉందని తెలిసికొని - నిత్యమూ ప్రార్థన చేయండి, అని ప్రబోధించారు. వినడము, కీర్తించడము ధ్యానించడము ఉండాలని వీరి సిద్ధాంతములోనూ ఉన్నది.

ఇస్లాం మతప్రవక్తయైన మహమద్ ప్రవక్తగారు - భగవంతుడు సర్వజ్ఞ శిరోమణి. [కొరాన్ 9భా. 8అ. 2వి. 17చ] నిన్ను నీవు చేయుచున్న పనులను భగవంతుడే సృజించెను. [కొరాన్ [illegible] 27అ 3వి 96చ.]

ఈ లోకములో శాశ్వత సుఖము లేదు" ఇత్యాద్యుపదేశములనేకములు గలవు. వీరు "అల్లాహూ అక్బర్" అని ప్రార్థింతురు. అల్లా - అనగా సర్వవ్యాపి. నిత్యశుద్ధబుద్ధ ముక్త స్వభావుడని యర్థము వచ్చును అతడే గొప్పవాడని ఆ పదమున కర్థము. పదములు మారినంత మాత్రమున వ్యక్తి మారడు. "అమ్మ - అని పిల్చుటకు, తెలుగులో "అమ్మ" అనియు, ఆంగ్లములో "మదర్" అనియు, హిందీభాషలో "మా" అనియు జర్మనీ భాషలో ముట్టర్ అనియు. తమిళంలో "అమ్మ", అరబ్బీ భాషలో "ఉమ్", ఉర్దూలో "మా" అనియు, ఎవరి భాషలో వారు పిలచెదరు. పేర్లు మారిననూ, పిల్చునది అమ్మనే కదా! అట్లే అర్థము కూడమారదు. సర్వవ్యాపియే దేవుడని - అతడే గొప్పవాడని, అతని ప్రార్థింపుమని ఆ మతమున ప్రవక్త చెప్పెను. మతమనగా సిద్ధాంతము. ఇస్లాం - అనగా సంపూర్ణముగా భగవదధీనమగుట, సర్వస్వము ఆయన కర్పించుట అని అర్థము. భగవంతుని చేరుటకు ఇస్లాం [సర్వస్వమూ ఆయనకే అర్పించుట] మతమే సత్యమైనది. [కొరాన్ 3భా, 3అ, 2వి, 18 చ.]

ఎవడు భగవంతుని వదలక గట్టిగా పట్టుకొనునో అతడే మంచి మార్గమున నడచుచున్న వాడగును. [4భా, 3అ, 10వి, 100 చ.)" ఇట్లు చెప్పుడు - నా ధ్యానము, నా త్యాగము, నా జీవితము, నా మరణము అన్నియు భగవంతుని అధీనములే !" [8భా, 6అ, 20వి, 163 చ.]

ఇందలి భావము, గీతయందలి, "సర్వధర్మాన్ పరిత్యజ్య...." అను శ్లోక భావమే. దేవునే త్రికరణ శుద్ధిగా నమ్మవలెనని కదా గీతాచార్యులవాణి ఇస్లాం మతస్థులు "ఓంకారమందు గల తురీయావస్థ సూచకమా అనునట్లు మసీదులలో ప్రశాంతిలో ధ్యానింతురు. నిర్గుణ పరబ్రహ్మగా, నిర్వికారునిగా, సాష్టాంగ ప్రణామములతో ధ్యానింతురు. వీరి ధ్యాననిష్ఠ సాక్షాత్తు పరబ్రహ్మానందప్రాప్తి సాధకము. వీరు త్రికరణ శుద్ధిగా ధ్యానింతురు.

వీరికి కూడ భగవంతు డొక్కడనియే సిద్ధాంతము, క్రైస్తవుల మతములో కూడ దైవము ఒక్కడనియే సిద్ధాంతము. కావుననే ధర్మ శాస్త్రములో ముఖ్యమైన ఆజ్ఞగా ఈ క్రింది విషయములను క్రీస్తుచెప్పెను "నీ పూర్ణ హృదయముతో నేను, నీ పూర్ణ ఆత్మతోను, నీ పూర్ణ మనస్సుతోను, నీ దేవుడైన ప్రభువును ప్రేమింపవలెను, ఇది ముఖ్యమైన మొదటి ఆజ్ఞ" "నిన్నువలె" నీ పొరుగు వానిని ప్రేమింపవలెను." [మత్తయి 22-3. 37 to 40] ఈ రెండు ఆజ్ఞలు ధర్మశాస్త్రమంతటికిని, ప్రవక్తలకు ఆధారమై యున్నవని అతనితో చెప్పెను.

"Teacher", he asked, "Which is the greatest commandment in the law ? Jesus answered, "You must love the lord your God with all your heart, with all your soul, and with all your mind. "This is the greatest and the most important commandment. The second most important commandment is like it. "You must love your fellow - man as yourself. "The whole law of Moses and the teachings of the prophets depend on these two commandments.

[Matthew 22, 36 to 40]

ఇందున్న భావము వలన దైవము యొక్క ప్రభావము తెలియుచున్నది. "ఏలీ! ఏలీ!" దేవా! దేవా! అని క్రీస్తుదేవుని పిలిచెను. ఈరీతిగా దేవుడు ఒక్కడేనని అతడే సర్వశక్తి సంపన్నుడని తెలియుచున్నది.

మూడు మతములందును, దైవమొక్కడే యనియు, ఆతడే సర్వజ్ఞుడనియు, ఆతనినే నమ్మి నిత్యము ప్రార్థించుమనియు, ఆతడే రక్షించుననియు, నిజమైన ప్రేమయే దైవమని కలదు.

దుఃఖములను తొలగించుకొనుటకు ఒక్క ప్రార్థనయే మార్గమని, కావున సర్వశక్తి సంపన్నుడైన దైవమునే ప్రార్థింపుమని మూడు మతములు ముక్తకంఠముతో చెప్పినవి. విశాలవిశ్వంలో జనించిన మానవాళి మనుగడకిది ఒక్కటే మార్గము. విశాలహృదయంతో విశ్వశాంతికోరి, విచారించిననాడు ఈ విశాలభావం ఏ వివేకికి అయినా కలుగక మానదు. సంకుచిత స్వభావాలు వదలి, విశాలవిశ్వం ఒకటే కుటుంబంగా తలచిన ప్రతీవాడూ చెప్పే పరమార్థం - ఇదొక్కటే! అదే "ఏకమేవాఽద్వితీయమ్ బ్రహ్మ" - అద్వితీయమగు బ్రహ్మ ఒక్కటియే సత్యమైనది. ఇది నూటికి నూరుపాళ్ళు యదార్థమైనది. నిత్యసత్యమైనది. కావున అట్టి నిత్యసత్యమైన ఆత్మను దర్శించాలి. గురువుల కటాక్షం మన వేదమూలకంగా వినాలి. విన్నవిషయం మననం చేయాలి. ధ్యానంలో లీనం కావాలి. అపుడే ఆత్మ తెలియును. ఆత్మతెలిసిందా - సర్వమూ తెలియును ఇదే ఆనంద స్థితి. ఈ స్థితిలో భయం ఉండదు. దీనినే పండితులు బ్రహ్మానంద మందురు.

"యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ
ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన"॥

ఈశ్వరునియందు కలిగే పరమానురాగమే భక్తియని శాండిల్య మహర్షుల భక్తి దర్శనము

"అథాతో భక్తి జిజ్ఞాసా" "సా పరాను రక్తిరీశ్వరే"

ఈశ్వరునే శరణుపొంది, సతతమూ ఆయననే ప్రేమించి, ధ్యానించువాడు ముక్తి పొందునని నారదభక్తి సూత్రములలో గలదు. "శ్రద్ధగల భక్తుడే జ్ఞానము పొందునని" శివగీతలో గలదు.

ఏకమూర్తి ధ్యానమే శ్రేష్ఠమని - లీలాశుకులు కృష్ణకర్ణామృతములో "రామునిలో – కృష్ణుని రూపము చూపింపుము, అపుడు నమస్కరించెద"నని రమ్యముగా పల్కెను. కావున ధ్యానము సర్వోత్కృష్టమైనది ధ్యానములోనున్నవారికి గల్గు దివ్యానుభూతి అవర్ణనీయము. వారికి బాహ్యప్రపంచముతో పనిలేదు. శ్రీరామకృష్ణపరమహంసగా , శ్రీరమణమహర్షిగారు, ధ్యానములోనుండగా వారిపైనుండి త్రా పా ము ప్రాకిననూవారు చలించలేదు. వారికి తెలియదు. ధ్యానమునకు ప్రతినిధి శ్రీకృష్ణచైతన్యస్వామి. వారు రాధాకృష్ణుల పాదపద్మములనే నిరంతరము ధ్యానించి. తరించిరి వీరందరూ వారు, వారు, ధ్యానించు మూర్తులందు ఓంకారమందుగల తురీయస్థానమగు నిశ్శబ్ద ప్రశాంతస్థితిని, ధ్యాన సమాధిలో పొంది ముక్తులైరి.

సర్వదర్శనములు - ఓంకారము :- పరబ్రహ్మ స్వరూపమే ఓంకారము. దీనిని ఒక్కొక్కరొక్కొక్క విధంగా కీర్తించి తరించారు. శుకమహర్షి భాగవతాన్ని కీర్తించి తరించారు. అట్లే సర్వవ్యాపి అయిన బ్రహ్మస్వరూపాన్ని కీర్తించినా, వినినా, జపించినా ఫలితం సమానమే. కొందరు దర్శనగ్రంథాలు రచించారు. సంసార మూలకారణ నాశక జ్ఞానసాధనము దర్శనమనబడును. ఆ విద్యను ప్రతిపాదించే గ్రంథమునుకూడ దర్శనమందురు. దర్శన శబ్దమునకనేకార్థములున్నవి. ఎవరి బుద్ధి ననుసరించి వారు దర్శించిన విధానమును ఒక గ్రంథముగా రచించిరి. సంసారమూలమును నమ్మి, ప్రమాదభూయిష్టమైన పురుషబుద్ధితో వ్రాసిన దర్శనములే నాస్తిక దర్శనములు. వేదములనే ప్రమాణముగా నమ్మి, వేదమార్గముననుసరించి రచింపబడిన గ్రంథములే ఆస్తిక గ్రంథములు. ఇవి పురుషనిర్మితములైనను వేదప్రామాణ్యమునంగీకరించి రచింపబడినవి. "నాస్తికో వేద నిందకః" - అను మనువచనమే యిందులకు ప్రమాణము.

మానవులకు ముఖ్యపురుషార్థము మోక్షము. ఇది సంసార మూలకారణ నాశనము వలననే కలుగును. అనగా జ్ఞానమువలననే మోక్షము సిద్ధించును. "జ్ఞానా దేవతు కైవల్యమ్" దీనిని బోధించునది అద్వైత దర్శనం. దీని శ్రవణ, మనన, నిది, ధ్యాసా మూలమున ముముక్షువులకు మోక్షము కలుగు కావున దీనిని తెలిసికొనుట సాధకులకు అత్యంత ముఖ్యము. ఈ దర్శనము తెలిసికొనుటకు పూర్వము, అసలు దర్శనములెన్నియో, రేఖామాత్రముగా తెలిసికొనుటచే, వాటియందు దీనికిగల స్థానము తెలియుటయేగాక, దీనియందలి సుగుణము గూడ స్పష్ట పడగలదు. భోగులున్ననే యోగులెవరో గుర్తించగలము. అందరూ యోగులైనచో ప్రశ్నయే లేదు. అటులనే ఈ దర్శనములలో కొన్ని సంసార సుఖములను నమ్మినవి కొన్ని వేదప్రామాణ్యము నంగీకరించలేదు, వాటిని నాస్తిక దర్శనము లందురు చార్వాక, బౌద్ధ, జైన, ఆర్హత, దిగంబర, సామ దర్శనములు.

చార్వాకులు ప్రత్యక్షమొక్కటే ప్రమాణమని, సుఖమే స్వర్గమని, అది అంగనా లింగనాది జన్యమగు సుఖమని, అప్పుచేసి నేయి త్రాగాలని, ఇత్యాది రీతిగా చెప్పుదురు. ఈ నాస్తిక దర్శనము హేతువాదమునకు నిలచునది గాదు వైశేషిక, న్యాయ, సాంఖ్య,యోగ, పూర్వమీమాంస. ఉత్తర మీమాంసా దర్శనములు, ఆస్తిక దర్శనములు. ఇవి వేదప్రామాణ్యము నంగీకరించినవి. ఇవికాక నకులీశపాశుపతము, శైవ, ప్రత్యభిజ్ఞ, రసేశ్వర దర్శనములనునవి కూడా కలవు.

వీరందరూ ప్రమాణముల నాధారముగా ఈ గ్రంధరచన గావించిరి. మొత్తము ప్రమాణములు తొమ్మిది గలవు. ఒకొక్కరు ఒక్కటిగాని, అంతకన్న ఎక్కువగాని ప్రమాణములను గ్రహించి, వారి ప్రమాణములను సాధించి ప్రబలయుక్తులతో ఇతర గ్రంధములందలి ప్రమాణములను ఖండితురు.

ప్రమ — యనగా యథార్థానుభవము. కరణమనగా అసాధారణ కారణము ప్రమాకరణమే ప్రమాణమని తర్కశాస్త్ర వ్యవహారము శ్రీ గౌతమ మహర్షి మొదలు ఉదయనా చార్యులవరకు గలవారు — ప్రమేయ విచారమున కెక్కువ ప్రాధాన్యము నిచ్చిరి. శ్రీగంగేశోపాధ్యాయులవారి "తత్త్వ చింతామణి" వచ్చిన తర్వాత ప్రమాణ విచారమున కెక్కువ ప్రాధాన్యము వచ్చినది. ప్రమాణములను గూర్చి విపులముగా న్యాయ వర్శనమున చర్చింపబడినది.

చార్వాకులకు ప్రత్యక్ష మొక్కటే ప్రమాణము. వైశేషికులకు, బౌద్ధులకు ప్రత్యక్ష, అనుమానములు ప్రమాణములు, జైనులకు ఈరెండే ప్రమాణములు. వీరు స్యాద్వాదులు.

"స్యాదస్తి, స్యాన్నాస్తి, స్యాదస్తి చ నాస్తిచ,
సాదవక్తవ్యః, స్యాదస్తి చావక్తవ్యః
స్యాన్నాస్తి చావక్తవ్యః, స్యాదస్తిచ నాస్తి చావక్తవ్యః॥" ఇతి

సాంఖ్యులకు యోగులకు ప్రత్యక్షము అనుమానము, శబ్దము-అను మూడే ప్రమాణములు. నైయ్యాయికులకు ప్రత్యక్ష అనుమాన ఉపమాన శబ్దములు నాలుగు-ప్రమాణములు. ప్రభాకరులకు-ప్రత్యక్ష అనుమాన ఉపమాన శబ్ద అర్థాపత్తులు ఐదు ప్రమాణములు. భాట్ట మీమాంసకులకు - వేదాంతులకు - ఆరు ప్రమాణములు. అవి ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్ధ, అర్థాపత్తి, అనుపలబ్ధి- అనునవి స్వతఃప్రమాణవాదులగు వీరికి వేద ప్రమాణమే ప్రాణము. [శబ్దప్రమాణము] పరతః ప్రమాణ వాదులగు తార్కికులకు అనుమాన ప్రమాణమే ప్రాణము. పౌరాణికులకు పై ఆరు ప్రమాణములతో సంభవైతిహ్యములు కలసి ఎనిమిది ప్రమాణములు. తాంత్రికులకు చేష్టతో కలిపి తొమ్మిది ప్రమాణములు.

వేదప్రామాణ్యము నంగీకరించిన దర్శనములను దర్శించుట ఈ దర్శనకారులకభిమతము, చార్వాకాది మతములను ఖండించుట కొఱకే అచ్చటచ్చట చూపబడెను. వైశేషిక న్యాయ సాంఖ్యాదులలో ఉత్తరమీమాంస ఉత్కృష్టమైనది. ఇందు ఆత్మైకత్వము, జగన్మిథ్యాత్వము నిరూపింపబడెను.

వైశేషిక దర్శనమునకు కర్త కణాదముని. భాష్యకర్త — ప్రశస్తపాదుడు. వార్తిక కర్త - జగదీశ భట్టాచార్యుడు. ఇందు ధర్మము బోధింపబడినది తేజోభావమే తమస్సు అని ఇందు చెప్పబడెను ఇందు తత్త్వము కనబడు చున్నది, ఆత్మయే పరమాత్మ. కావున ప్రతి మానవుడు జ్ఞాన స్వరూపుడే కాని జ్ఞానము లేకపోవడముచేతనే అజ్ఞాని అంటున్నాం. కాని యథార్థంగా అజ్ఞానంలేదు. జ్ఞానాభావమే అజ్ఞానము. అజ్ఞానమనునది మిథ్యయనినచో ఇది సరిపడును. కావున ప్రతివ్యక్తి తనలోని జ్ఞానజ్యోతిని తరచిచూచినవాడు - తేజస్వంతుడగును కణాదమహర్షి ఈశ్వరుని తపస్సుచే తృప్తిపరచినట్లు గలదు వల్లభాచార్యులు "న్యాయలీలావతి"అనువైశేషిక ప్రకరణమును వ్రాసెను. దీనికి రఘునాథశిరోమణి "న్యాయలీలావతీ దీధితి". వర్ధమానోపాధ్యాయుడు - న్యాయలీలావతీ ప్రకాశ, శంకరమిశ్రుడు- న్యాయలీలావతీ కంఠాభరణము - అను టీకలు రచించిరి. ద్రవ్య గుణ, కర్మ సామాన్య, విశేష, సమవాయ, అభావములను సప్త పదార్థములు చెప్పబడెను. పృథివ్యప్ తేజోవాయ్వాకాశ కాల దిగాత్మ మనస్సులను 9 ద్రవ్యములిందు చెప్పబడెను. చీకటి ద్రవ్యము కాదని భాట్టులు, వేదాంతులుకూడ నమ్మెదరు. వెలుతురు లేకపోవుటయే చీకటి. నల్లటి చీకటి కదలుచున్నదన్నమాట భ్రమ దిక్కు, కాలము ఈశ్వరరూపాలని రఘునాథ శిరోమణివాణి. రూప, రస, గంధస్పర్శ సంఖ్యాపరిమాణ పృథక్త్వ సంయోగ విభాగ పరత్వాపరత్వ గురుత్వ ద్రవత్వ స్నేహ శబ్దబుద్ధి సుఖదుఃఖేచ్ఛాద్వేష ప్రయత్న ధర్మాధర్మ సంస్కారములను గుణములు 24 చెప్పబడెను.

వైశేషికతర్కము ఈశ్వరుని అంగీకరించలేదు. న్యాయమంగీకరించినది. కణాదముని ఈశ్వరునిగూర్చి తపమాచరింపగా, ఈశ్వరుడు గుడ్లగూబ రూపమున ప్రత్యక్షమై ద్రవ్య గుణాది భావపదార్థ షట్కము ఉపదేశించినట్లు రాజశేఖరుని న్యాయకందళి వ్యాఖ్యానమున గలదు. కావున వైశేషికకర్త ఈశ్వరుని నమ్మినట్లు తెలియుచున్నది. వీరు ఆత్మ-ద్రవ్యమందురు. ద్రవ్యము గుణాధికరణము. ఈ రీతిని వీరు చెప్పుదురు వేదాన్తులు ఆత్మ జ్ఞానరూపమందురు. వైశేషికులు ఆత్మకు 9 గుణములు చెప్పిరి. కావున ఆత్మ జననమరణ ప్రవాహము కలది. ఇదే సంసారము. సంసారమును తొలగించుకొనుటకై ఆత్మ - శ్రవణ మననాదులను వేదోక్తముగా ఆచరించును. ఆత్మజేయు మననమువలన తత్త్వజ్ఞానము కల్గును. ఇదే మోక్షము [తత్త్వజ్ఞానాన్నిశ్రేయసమ్]

న్యాయదర్శన కర్త గౌతముడు. భాష్యకర్త - వాత్స్యాయనుడు. వార్తికకర్త - ఉద్యోగకరుడు. ప్రతిజ్ఞ, హేతు, ఉదాహరణ, ఉపనయ, నియమనములను 5 అవయవాలు కలిసి న్యాయమనబడును. వేదముల నంగీకరింతురు. ఈశ్వరుడొక్కడేయని వీరి అభిప్రాయము. తర్కమనగా ఊహించుట. ఈ యూహ పక్ష ప్రతిపక్షముల నాధారముగా నుండును. సందిగ్ధ సాధ్యవంతము పక్షము. పర్వతము వహ్నిమంతమా? కాదా? అని సందేహము. వహ్నిసాధ్యము. ధూమవత్త్వ హేతువుచే సాధ్యమగువహ్ని యొక్క సందేహం కల్గడంచేత పర్వతం - పక్షము. అనుమానించిన విషయమును - ఇతరునిచే ఒప్పించవలెనన్న పంచావయవములను వాదమున ఉపయోగింతురు. ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణ, ఉపనయము, నిగమనము. "ప్రతిజ్ఞా హేతూదాహరణోపనయ నిగమ నాన్యవయవాః" అని అక్షపాదులవారి సూత్రము. ఆత్మకలదా లేదా అనునపుడు తర్కమునుబట్టి ఒక పక్షంవారు ఆత్మగలదని సాధించెదరు. చివరకు

"తత్త్వమసి - పక్షద్వయంవారు నిర్ణయిస్తారు. ప్రమాణ ప్రమేయాది తత్త్వజ్ఞానం వలన మిథ్యాజ్ఞానం తొలగును. అంతట దుఃఖ నివృత్తి కల్గును. అదియే మోక్షము.

"దుఃఖ ధ్వంసం గోతమో మోక్షమాహ" నవీన తర్కమున "అన్నంభట్టు" పండితుడు - తర్క సంగ్రహ"మను ప్రకరణము వ్రాస తానే దానికి దీపిక - అను టీకను వ్రాసెను. విశ్వనాథ పంచాననుడు "కారికావళి" అను ప్రకరణమును వ్రాసి, దానికి "న్యాయముక్తావళి" — అను విపులమగు వ్యాఖ్యతోనే వ్రాసెను. ఈ ముక్తావళికి దినకరుడు "ప్రకాశ" అను టీకను వ్రాసెను. దానినే "దినకరి" అనికూడ పిలిచెదరు. దినకరికి - రామరుద్రుడు "తరంగిణి" - అను వ్యాఖ్యను వ్రాసెను. ఈ దినకరికి - "సుభోధిని" యను వ్యాఖ్యను శ్రీబులుసు అప్పన్నశాస్త్రిగారు వ్రాసిరి. నవీన తర్కము గంగేశుని చింతామణితో ఉద్భవించి, నలు మూలల వ్యాపించినది. న్యాయమున "జగదీశ - గదాధరులు మాధురి మధురనాధుడు - మహావిద్వాంసులు.

సాంఖ్య దర్శన కర్త కపిల మహర్షి. ప్రత్యక్ష, అనుమాన, శబ్ద ప్రమాణములను వారంగీకరించిరి. సాంఖ్య కారికలు - ఈశ్వర కృష్ణ నిర్మితములు. ఈ కారికలకు శ్రీ గౌడపాదులు చక్కని భాష్యము రచించిరి. ఇందు తత్వజ్ఞానము గలిగిన పురుషుడే ముక్తుడగును.

యోగదర్శనకర్త పతంజలి, భాష్యకర్త - వ్యాస మహర్షి వార్తిక కారుడు విజ్ఞాన భిక్షువు. యోగమనగా చిత్తవృత్తి నిరోధమని తెలిపెను, "యోగశ్చిత్తవృత్తి నిరోధః" ఇది ప్రత్యేక లక్షణము. [ఆత్మ విద్యాసాధనము - యోగమని ఉపనిషద్వచనము] యోగములేనిచో ఆత్మవిద్య సిద్ధించదు. ఆత్మ విద్యకే యోగము అవసరము. యోగ భాష్యమునకు శ్రీ శంకరాచార్యులు వ్యాఖ్య రచించిరి. [సిద్ధాంతభాగముతప్ప] పతంజలి ఈశ్వరుని అంగీకరించిరి. ఈశ్వరుని బోధించెడి శబ్దము "ఓం"కారము.

"తస్యవాచకః ప్రణవః — అని పతంజలి చెప్పిరి. "ఓం"కార మును జపించుట ఈశ్వర భావన యనిరి. "ఓమ్" కారమును జపించుట వలన చిత్తమేకాగ్ర మగును. అంత సమాధి స్థితి పొంది మోక్షము కల్గును. సమాధి యనుటచే అష్టవిధ యోగాంగములను గ్రహింప వచ్చును. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార ధారణ, ధ్యాన. సమాధి - ఇవి అష్టాంగములు. ఈ రీతిగా పాతంజలి దర్శనము మోక్ష ప్రతిపాదకము.

పతంజలి - పస్ప శాహ్నికమున - నిత్యానిత్యవస్తు విచారణము చూపెను. ఈశ్వరుడు - ఓంకారవాచ్యుడు - అనిచెప్పి, ఆ ప్రణవమును జపించుట, ఆ ప్రణవవాచ్యుడైన ఈశ్వరుని ధ్యానించుట, సమాధి సాధనములుగా చెప్పెను. "తజ్జపస్తదర్థ భావనమ్" ఈ విధముగా ఓంకార మును తెలిసికొని ధ్యానించినవారు ఈశ్వరత్వము పొందెదరు. అవిద్య వలన బంధము కల్గును. వివేకజ్ఞానమువలన మోక్షము కల్గును.

వ్యాకరణ దర్శనకర్త - పాణిని. కాత్యాయనుడు - వార్తిక కారుడు. కాత్యాయనుని - వరరుచి అందురు. సూత్రకార్తికములకు పతంజలి మహాభాష్యము రచించెను. వ్యాకరణ భాష్యమునకే - మహా భాష్యమని పేరు.

"వాక్యకారం వరరుచిం భాష్యకారం పతంజలిమ్,
పాణినిం సూత్రకారంచ ప్రణతోస్మి మునిత్రయమ్॥"

వైయాకరణులు 5 ప్రమాణము లంగీకరింతురు. అవిద్యా నివృత్తియే మోక్షము. పాణినికి స్ఫోటవాదము సమ్మతమే.

ఆత్మ యందేకత్వమే కలదని, సమస్త జగత్తుకు కారణం బ్రహ్మమని - పతంజలి అభిప్రాయం. "బ్రహ్మైకత్వ విజ్ఞానం మోక్షః, బ్రహ్మైవ సర్వజగత్కారణమితి పతంజలిః" అని వైద్యనాథుని మంజూషా వ్యాఖ్య. ఈతడు నాగేశోపాధ్యాయుని శిష్యుడు. శ్రీ భర్తృహరి వాక్యపదీ

యమున, అద్వైతవాదమును పతిష్ఠము చేసెను భర్తృహరి, బ్రహ్మ ఏకాక్షర స్వరూపతన్న విషయాన్ని విపులీకరించెను, ఆ రీతి ఓంకారోపాసన చేసెను. స్ఫోట శబ్దము నిర్గుణ పరబ్రహ్మమని తలచిరి స్ఫోట శబ్దము తెలియగానే అవిద్య తొలగును. అదే సచ్చిదానంద రూపమైన మోక్షము "శబ్ద బ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధిగచ్ఛతి."

పూర్వమీ మాంసాదర్శనకర్త జైమిని. భాష్యకర్త - శబరస్వామి వార్తికకారుడు - కుమారిల భట్టు వేదవిహిత కర్మలు నాచరించవలెను. వాటిచే ధర్మము కల్గును. నిత్యకర్మా చరణము వలన పాపములు నశించును. ధర్మాధర్మము లేకుండుటచే ఆత్మకు మరొక శరీరమురాదు. అదే మోక్షము, "అథాతో ధర్మ జిజ్ఞాసా" అని ఈ దర్శనము ప్రారంభింపబడినది. "అన్వాహార్యేచ దర్శనాత్" — అనునది చివరి సూత్రము. ఈ జిజ్ఞాసాధి కరణమునకు, "స్వాధ్యాయోఽ ధీతవ్యః" అను వేదవాక్యము విషయము. వేదము చదువతగినది.

"వేదాధ్యయనానంతరము, అధ్యయనము, అర్థజ్ఞాన ఫలకమగుటచే అధ్యయనమువలె వేదార్థ విచారణ వేదవిహితం కావున వేదార్థ విచారణ చేయవలెను. అని సూత్రార్థము. వేదము చదివి, దాని అర్థము కూడా చదువవలెను. కావున వేదాన్ని చదవాలి. అందలి అర్థము తెలిసికొని, వేదవిహిత కర్మలను ఆచరించాలి వేద ప్రామాణ్యమును లోకములో స్థిరపరచాలని, శివుడు తలచి - కుమారస్వామిని అందుకు నియోగించెను. కుమారస్వామియే కుమారిల భట్టు రూపమున జన్మించి, నాస్తిక మతములను ఖండించి, వైదిక మార్గమును స్థిరపరచెను. వేద ప్రామాణ్యమును సుస్థిరము చేసెను. పూర్వమీమాంసా శాస్త్రమునకు వార్తికములు వ్రాసెను, దీనినే భాట్టమత మందురు. ఇతని శిష్యులలో ముఖ్యుడు ప్రభాకరుడు. ఇతను చెప్పిన మతము ప్రాభాకర మతము, ఈతని మతమునకే "గురుమతము" అనికూడ అందురు.

ఖండదేవుడు - "భాట్ట రహస్యము" అను గ్రంథము రచించెను పార్థసారధి "శాస్త్రదీపిక" రచించెను.

ఉత్తర మీమాంసా దర్శనమునకు కర్త శ్రీ వేదవ్యాసులవారు. ఈ దర్శన భాష్యకర్తలు శ్రీశంకర భగవత్పాదులు. వార్తిక కర్తలు - నారాయణ సరస్వతి. ఈ దర్శనమునందు 555 సూత్రములు గలవు. ఆత్మ జ్ఞానమువలన మిథ్యా జ్ఞానము తొలగును. జీవేశ్వర భేదము అవిద్యవలన కల్గును. అవిద్య తొలగిన జీవేశ్వరైక్యము గోచరించును. బ్రహ్మయందు జగత్తు అధ్యస్త మైయున్నది. నిర్గుణవేత్తకు విదేహ కైవల్యప్రాప్తి నిరూపింపబడినది. ఇదే అద్వైత వేదాంత సిద్ధాంతసారము.

ఉపనిషత్తులన్ని బ్రహ్మను గూర్చి చెప్పుచున్నవని శాంకర భాష్యము. ఈ రీతిగా బ్రహ్మను గూర్చియే ఈ దర్శనము సర్వేసర్వత్ర బోధించును. ఆత్మయే పరమాత్మ. పరమాత్మయే బ్రహ్మ అను తత్త్వమును ప్రబోధించును. శ్రీ వాచస్పతి మిశ్రుడు శారీరిక మీమాంసా భాష్యమునకు "భామతి" అను వ్యాఖ్య వ్రాసెను. "భామతి"కి - కల్పతరు వను వ్యాఖ్య గలదు. ఈ రీతిగా ఎన్నో ప్రబంధములు అద్వైతమునే ప్రబోధించినవి.

శ్రీ మధుసూదన సరస్వతి రచించిన "అద్వైతసిద్ధి", శ్రీ బ్రహ్మానంద సరస్వతి విరచిత - 'లఘుచంద్రిక" - అను [అద్వైత సిద్ధికి టీక] టీక అద్వైత సిద్ధాంత నిరూపణకై పుట్టిన ఉత్తమోత్తమ గ్రంథములు. ఇట్టిదే — కవితార్కిక శిరోమణి శ్రీహర్ష విరచిత ఖండవ ఖండ ఖాద్యము.

ఈ రీతిగ దర్శన గ్రంథములు చాల వెలసినవి. మూల గ్రంథములు పరిశీలించినచో అందలి విశేషము లెన్ని యేని తెలియును. ఇచట స్థాలీపులాక న్యాయమున తెలుపబడినవి. ఏకాక్షరమైన "ఓం"

కారము నుండియే సమస్త సృష్టి జరిగినది గావున ఓంకారార్థ వివరణకై ఈపై విషయములు తెలుపబడినవి. అద్వైత దర్శనమే అందరకు శిరో ధార్యము. అందలి అంతరార్థమైన "ఓం"కార ధ్యానమే సాధకులకు ఉత్తమ సాధనము. "ఓం"కారమును నిరంతరము ధ్యానించుట వలననే బ్రహ్మప్రాప్తి కలుగును. కాశియందు ప్రాణములు వదలినంత మాత్రము ముక్తి కల్గును - అనుటలో ఒక రహస్యమున్నది. కాశీయందు వాస మున్న విశ్వనాధుడు, అచట ప్రాణము వదలెడి జీవులకు "ఓం"కార మును ఉపదేశించును. అంత్యకాలమున వారు విశ్వనాధుని ఉపదేశముచే "ఓం"కారము ధ్యానింతురు. కొందరు విశ్వనాధుని ఉపదేశమును వినుట చేతనే ముక్తి పొందెదరు. కాశియందు ప్రాణములు వదలువారు ముక్తి పొందుటకు కారణము కాశీ విశ్వనాధుడే. ఆ పరమేశ్వరుడుపదేశించెడి మహామంత్రము తారక మంత్రము. ఆ తారక మంత్రము - ఈ 'ఓమ్"

ఓంకారము జపించుటకు దేవతలు, మానవులుకూడ అర్హులే - అని తెలిసినది. జంతువులకుకూడ అర్హతగలదని ఛాందోగ్యోపనిషత్తు నందుగల ఒక అపూర్వగాధవలన తెలియుచున్నది. ఎవరు దేనిని కోరి - 'ఓం' కారము జపించిన, వారికి అది సిద్ధించును.

ఓంకార మహిమ :- ఒక గ్రామము వెలుపల గలవనములో చాల కుక్కలు నివసించుచుండెను. వాటికి అన్నము దొరుకుటలేదు. చాల రోజులనుండి ఉపవాసము చేయుచున్నవి. ఒక రోజున ఒక దివ్య మైన తెల్లనికుక్క చెంతకు ఆ చుట్టు పక్కనగల నక్కలన్నియు వచ్చి చేరినవి. అవన్నియు ఆ తెల్లకుక్కను గొంతెత్తి ప్రార్థించినవి. ఓ సర్వ జ్ఞుడా ! మేము ఆకలిచే బాధపడుచున్నాము. మీరు అన్నము సంపా దించి యిచ్చిననే మేము బ్రతుకగలము. మీ గాన విద్యా ప్రభావంచే అన్నం సంపాదించి యిచ్చిననే మేము బ్రతుకగలము. మీ గాన విద్యా ప్రభావంచే అన్నం సంపాదించి మాకు యిచ్చిన, మేము ఆకలి తీర్చు

కొందుము. ఈ రీతిగా ఆ తెల్లకుక్కను, మిగిలిన కుక్కలు ప్రార్థించి నవి. అంత తెల్లకుక్క సంతోషించి, అటులనే నా గాన సామర్థ్యంచే అన్నము సంపాదించెదను. ఉదయమే మీరు నన్నిక్కడ కలసికొనుడు మీ పని సాధించెదను అని చెప్పెను. ఈ విషయమునంతను, బకుడను ఋషి గమనించుచుండెను. ఈ కుక్కల వృత్తాంతము తెలిసికోవలెనని అచటనేయుండి గమనించుచుండెను. ఆ చోటనే ఉదయమందు ఆ తెల్ల కుక్క చెప్పిన ప్రకారము, మిగిలిన కుక్కలన్నియు వచ్చి చేరినవి.

బహిష్పవమాన స్తోత్రము చేయువారివలె, అవన్నియు ఆ ప్రాంతమున ఒకరి వెనుక ఒకరు వరుసగా ప్రవేశించి క్రమబద్ధముగా కూర్చొని, "ఓం"కార సూర్తి కలిగిన గానమును ప్రారంభించిరి. ఇందు శ్వేతశునకము ప్రధానముగా గలది. ఇవన్నియు స్తోత్రస్థానములో కూర్చొన్నవై "ఓం" "ఓం" అని ఓంకారమును చేయుచున్నవి. ఓంకారము చేయుచు దేవతలను ప్రార్థించినవి. అన్నమునుత్పత్తిచేయు ఆదిత్య దేవుని ఓంకారముతో స్తుతిచేసినవి. "ఓం" - ఆదిత్యా! అన్నము ఇమ్మా! ఓం-అన్నము ప్రసాదింపుమా! అని ప్రార్థించి, "ఓం" "ఓం" అని గానము చేసినవి. ఈ ఓంకార ప్రభావమువలన శునకములకు అన్నము లభించి నది. అవి అన్నమును భుజించి చాల సంతసించినవి. ఈ దృశ్యమును చూచిన బకుడను మహర్షి "ఓంకార" మహిమను బహువిధముల స్తుతించెను.

శునకములు ఏకాగ్రమైన మనస్సుతో ఓంకారమును ధ్యానించి, తమ కోర్కెను నెరవేర్చుకొనినవి. ఉత్తమ జన్మపొందిన మానవులు "ఓం" కారమును ధ్యానించిన, వారు కోరిన కోర్కెలు తప్పక నెరవేరగలవని పై కథవలన తెలియుచున్నది.

ఏ ఫలముకోరి, ఎవరు ఓంకారం త్రికరణశుద్ధిగా ధ్యానిస్తారో వారికి, ఆయా ఫలములు తప్పక సిద్ధించును. నిష్కామబుద్ధితో ధ్యానిం

చినవారికి మోక్షము లభించును. కోరికలతో ధ్యానించిన కోరికలు నెర వేరును. "ఓం" కారము ఈశ్వరార్పణబుద్ధితో ధ్యానించినవారికి అంతః కరణశుద్ధి కలిగి, అజ్ఞానము నశించి, మోక్షము సిద్ధించుననుట సత్యము

"ఓం" కారార్థము తెలిసికొని. అందలి రహస్యము గుర్తించి, తురీయ స్థితిని పొందినవాడు నిర్భయమగు బ్రహ్మమే. ఓంకారము బ్రహ్మమని తెలిసికొని, నిత్యము మనసులో ధ్యానించువానికి, ఎక్కడి కెళ్ళినను. ఏపని చేసినను, సర్వేసర్వత్రా శుభము జరుగును. "ఓం" కారము ధ్యానించువాడు జీవించినంతకాలము - భయము లేనివాడై, దుఃఖములు లేనివాడై, సుఖంపొందుతూ, కోరిన కోరికలు నెరవేరినవాడై, అంత్యకాలమందుకూడ ఓంకారమునే ధ్యానించుచూ ప్రాణములొదిలినచో విదేహముక్తుడగును. అదే శాశ్వత బ్రహ్మానందస్థితి. అదే మోక్షము. అదే ఓమ్.

శ్లో॥ ఓమిత్యేకాక్షర ధ్యానాద్విష్ణు ర్విష్ణుత్వమాప్తవాన్,
బ్రహ్మబ్రహ్మత్వ మాపన్న శ్శివ తామ భజచ్ఛివః॥

"ఓం" కారమును ఏకాక్షర ధ్యానమువలననే - విష్ణువు విష్ణుత్వ మును పొందెను. బ్రహ్మ - బ్రహ్మత్వమును పొందెను. శివుడు శివత్వము పొందెను.

ఓంకారమును ధ్యానించి, దాని ప్రభావంవలననే బ్రహ్మ - సృష్టిశక్తిని, విష్ణువు - పాలనశక్తిని, శివుడు - లయమొనరించు శక్తిని పొందిరి.

సమస్త ప్రపంచమును సృజించిన బ్రహ్మకే శక్తిని ప్రహదించిన శక్తిని ధ్యానించినచో ముక్తి కలుగుట సిద్ధము. ప్రపంచములోగల చరాచరము లన్నియు బ్రహ్మయే సృజించెను. ప్రపంచములో గల సమస్త విజ్ఞాన మును బ్రహ్మయే సృజించెను. బ్రహ్మయంతటివాడు పూర్వము సృజిం చిన రీతిగా సమస్త లోకములను సృజించు చున్నాడు. సృజించు శక్తి

కొఱకై చాలకాలము తపస్సు చేసి, చివరకు ఓంకార ప్రభావముచే శక్తిని సంపాదించెను. తదుపరి ఓంకారశక్తిని గ్రహించిన బ్రహ్మ. ఓంకార శక్తి చెప్పినట్లు లోకములను సృష్టించుచున్నాడు. కావున బ్రహ్మకన్నను గొప్పదైనది ఒక్క ఓంకారమే.

బ్రహ్మ సృంజించిన జీవరాసులను పాలించుటకై, విష్ణువునకు-పాలనశక్తిని ప్రసాదించిన తల్లి - ఓంకారమే. పాలించుట యన్నచో బహు కష్టమైన విషయమే. కావుననే తన శక్తిని విష్ణువునకు ఇచ్చినది. విష్ణువనగా అంతటా వ్యాపించువాడు. పాలనశక్తిని ఓంకారమువలన గ్రహించి, నిత్యమూ దానినే ధ్యానించుచు దుష్టశిక్షణ, శిష్టరక్షణచేయుచు పాలించుచుండెను. ధర్మమునకు గ్లాని ఏర్పడినపుడు, అవతారములెత్తి ధర్మస్థాపనచేసి. సత్పురుషులకు పరబ్రహ్మ రహస్యములనుపదేశించి, ముక్తిని ప్రసాదించుచుండెను. త్రిమూర్తులలో ఎవరిని ధ్యానించిననూ వారియందుగల శక్తిస్వరూప మొక్కటే. వారిహృదయములందున్న ఓంకారప్రభావమే వారిశక్తికి కారణము. కావున పాలనచేయు సందర్భములో విష్ణువు ఎన్నియో సార్లు అవతారములెత్తెను, ఎత్తుచున్నాడు కూడ !

ఓంకార లక్ష్యము :- శోకరాహిత్యము, ఆనందప్రాప్తియే ఓంకారలక్ష్యము - కావున, ప్రజలలోగల శోకమును తొలగించి, ఆనంద ప్రాప్తి కల్గించి పాలించవలయునని విష్ణువు ఆశయము. ఆనందము కలిగించవలెనన్న, శోకమును తొలగించవలెను. శోకము తొలగించవలెనన్న, దుర్మార్గులను సంహరించినచో వారినుండి ఇతరులకు కష్టములు కలుగవు, కావున శారీరక బాధలులేకుండును. కావున శరీర సంబంధమైన దుఃఖములుండవు. ఆ తర్వాత మానసిక భయము తొలగించి, నిత్యమూ బ్రహ్మధ్యానము చేయించి బ్రహ్మవేత్తలను చేయవలయుననెడి కోరికచే విష్ణువు [సర్వవ్యాపి] ఓంకార ప్రభావముచే

పాలనశక్తి పొందినవాడై, అనేకములైన అవతారములెత్తి, విశ్వకల్యాణ కారకుడై, ఎందరికో ముక్తిని ప్రసాదించుచున్నాడు. వారి అవతారము లలో నాకు తెలిసిన ప్రసిద్ధావతారములు ఇరువదియొక్క అవతారము లకు మించియున్నవి. ఈ అవతారముల పేర్లు విన్నను చిత్తశుద్ధి కల్గును. వీరి అవతారములన్నియు ఓంకారధ్యానమువలన పొందిన విష్ణుత్వము కల్గినవి కావున ఓంకార స్వరూపములే. వాటిని ఇందు రేఖామాత్రముగా నైనను తెలిసికొనుట ముఖ్య కర్తవ్యము.

విష్ణువు - బ్రహ్మమానసమునుండి సనత్కుమారుడై జన్మిం చెను. వారు బ్రహ్మచర్య వ్రతదీక్ష గైకొని, ఎందరికో మహానుభావులకు ఆత్మతత్త్వము బోధించిరి. శిష్యులుకూడ బ్రహ్మవేత్తలై, ఎందరికో ఆత్మ తత్త్వము బోధించి, ముక్తి కల్గించిరి. ఇది సనత్కుమారావతారము. భూమిని చుట్టచుట్టి బాధించు రాక్షసుని సంహరించుటకై, విష్ణువు వరా హావతారమెత్తి, వానిని చీల్చిచెండాడి, కోరలపై భూమిని దాల్చెను. ఈ రీతిగ భూదేవికి సంతసము కల్గించెను. ఇది వరహావతారము.

సామవేదము సంగీత ప్రధానమగు వేదము. దీనిని సామగాన మందురు. ఇందంతటను ఓంకారార్థమే వినబడుచుండును. ఓంనందలి ప్లుతము ఎంత మాధుర్యమైనది.

ఇందు అకార ఉకారమకారములే వినబడు చుండును. పలు పర్యాయములు అ, ఉలు వినబడును. సామవేదం వింటూంటే మేను మరచిపోతాం ఇందింతటి గొప్పదనమున్నదని నిత్యమూ గానముచేసి మహర్షులను సహితం మోహ పరవశుల్ని చేయడానికై, నారదమహర్షిగ ఓంకార ప్రభావం వలన, విష్ణువే అవతరించెను. వీరు ప్రతి నిత్యము మహతి అనే వీణ తీసికొని ఓంకారం జపిస్తూ, "ఓం నమశ్శివాయ, ఓం నమో నారాయణాయ!" అంటూ సరిగమపదని అంటూ సప్తస్వరాలు విని పిస్తూంటే అందు ఓంకారమునందలి తురీయావస్థ కనబడుతుంది. ఇది

అనుభవిస్తేనేగాని అందని అపాతమధుర ఆనందం. ఆ పాతమధురాతి మధురమైన ఈ దివ్యామృతాన్ని అందించడానికై అవతరించిన ఆది విష్ణువు అవతారం-నారదావతారం.

విష్ణువు-దుష్టశిక్షణకై నర, నారాయణులుగా అవతరించెను. వీరు బదరికాశ్రమంలో తపస్సుచేసిరి. ఈతపస్సుకు భయపడి ఇంద్రుడు అప్సర స్త్రీలను వారి తపోభంగమునకై పంపెను. వచ్చినవారిని చూచి, వారికంటె అందముగల ఒక స్త్రీని, తమ తొడను చీల్చి అందు సృజించి ఆమెకు ఊర్వశి అని పేరిడి, వారికిచ్చి-ఇంద్రునకు కానుకగా పంపెను. ఎందరికో జ్ఞానభిక్ష ప్రసాదించెను. ఇది నర, నారాయణావతారము.

విష్ణువు, కర్దమునకు దేవహూతికి కుమారుడై జన్మించెను. ఇతడే కపిలమహర్షి. తత్త్వరహస్యముగల సాంఖ్యయోగమును రచించెను దీనిని తల్లికి చెప్పి, వారికి మోక్ష మిప్పించిన యోగావతారము - కపిలావతారము. విష్ణువు — అత్రిమహామునికి, అనసూయకు ప్రత్యక్షమై, వారలకు దత్తుడై దత్తాత్రేయ నామముతో జన్మించెను. ఎందరికో బ్రహ్మవిద్య నుపదేశించెను. ఇది దత్తాత్రేయావతారము.

ఓంకార స్వరూపుడైన విష్ణువు లోకమందలి దుఃఖములను పోగొట్టుటకై సుయజ్ఞావతారము దాల్చెను. తదుపరి, ఋషులకు బ్రహ్మవిద్య నుపదేశించుటకై వృషభావతారము ధరించెను. తర్వాత, పృథ్వవతారము దాల్చి - భూమిని సస్యశ్యామల మొనరించెను. సోమకుడనే రాక్షసుని చంపుటకై మత్స్యావతారము ధరించెను. అమృత సంపాదనకై సముద్రమును దేవరాక్షసులు మధించుట ప్రారంభించగా, మంధర పర్వతాన్ని మోయుటకై కూర్మావతారము ధరించి, దేవకార్యము నెరవేర్చెను ఆయుర్వేదమును నిల్పిన అధినేతగా ధన్వంతర్యవతారము ధరించెను. అమృతము పంచిపెట్టుటకై జగన్మోహిన్యవతారము దాల్చెను. పరమ భక్తుడైన ప్రహ్లాదుని రక్షించుటకై, దుష్టుడైన హిరణ్యకశపుని శిక్షించుటకై

నృసింహావతారము ధరించెను. ఇంద్రునికి స్వర్గమునిచ్చుటకై, దానినాక్రమించిన బలిని పాతాళమునకు పంపుటకై వామనావతారము దాల్చెను.

జమదగ్నికి, రేణుకాదేవికి కుమారుడై పరశురాముడను పేరుతో ప్రఖ్యాతి చెంది, కార్తవీర్యార్జునుని సంహరించి, చిరంజీవియైన అవతారము పరశురామావతారము.

పరాశరమహర్షికి, సత్యవతికి వ్యాసుడై యవతరించెను. వేద ధర్మాలను సర్వత్రా వ్యాపింప జేయాలని, ఓంకారతత్త్వాన్ని అందరికీ అందజేసి, బ్రహ్మవేత్తలను జేయాలనే సంకల్పంతో మిత్ర సమ్మితాలైన 18 పురాణాల్ని, 18 ఉపపురాణాల్ని. పంచమవేదమైన భారతాన్ని, బ్రహ్మసూత్రాద్యనేక గ్రంథములను రచించినట్టి అవతారము - వ్యాసావతారము మత్స్య, మార్కండేయ. భాగవత, భవిష్యత్, బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, వామన, విష్ణు, వాయు, వరాహ. అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కంద పురాణములు రచించెను. ఏకరాశిగా వినబడిన వేదమును విభాగించెను. కావుననే బాదరాయణునకు వేదవ్యాసుడని బిరుదు లభించెను.

పరదారాపహరణము మహాదోషమను వేదవాక్యమును సార్ధక్యము చేయుటకై [న పరదారాన్ గచ్ఛేత్], దుర్మార్గుడైన రావణుని సంహరించుటకై రాముడై అవతరించి, అతనినేకాక మరెందరో దుర్మార్గులైన రాకస వృషభాల్ని సంహరించి, భూభారం తగ్గించి, ధర్మమూర్తిగా వెలసిన పూర్ణావతారం రామావతారం.

హలముచే భూతలాన్ని దున్ని మధురమూర్తిగా వెలసిన అవతారం బలరామావతారం. కంసుడు, బకుడు మొదలగు మహాక్రూరులను సంహరించి, వేణుగానంచే గోప గోపికాదులకు ముక్తిని ప్రసాదించి, గీతాగానంచే అర్జున, ధృతరాష్ట్రాదులకు ఆత్మబోధ గావించిన, మధుర మోహనమూర్తి పరిపూర్ణావతారం శ్రీ కృష్ణావతారం.

"అహింసా పరమో ధర్మః" — అను శ్రుతి నిరూపణకై అవతరించి. హింసను మాన్పించి, సత్యము స్థాపించిన ధర్మమూర్తి అవతారం బుద్ధావతారం. ఓంకార తత్త్వాన్ని ప్రభోధించాలని, శ్రీసాయిగా అవతరించారు ప్రపంచమంతా పాపం నిండినపుడు, నాస్తికవాదం నాట్యం చేసేటప్పుడు, వేదాన్ని విస్మరించినపుడు, కలిఘోర నృత్యం చేయు సమయములో శంభల గ్రామంలో పుట్టే అవతారం. కల్క్యవతారం. ఈ అవతారములు దాల్చుటకు శక్తిని ప్రసాదించినట్టి - "ఓం"కారమును ఎవరు ధ్యానించిననూ, అంతటి శక్తి కలుగుననుట నిస్సంశయము.

ఈశ్వరునకు సర్వజ్ఞత్వమును ప్రసాదించినది - ఓంకారమే. మహాతపస్వి ఈశ్వరుడు. వీరు నిరంతరము హృదయ కుహరమున జపించు మంత్రము "ఓం"కారము. సర్వులు ఈశ్వరుని జపించెదరు. ఈశ్వరుడు ఓంకారమును జపించును. ఓంకార హృదయమును పూర్తిగ తెలిసినవాడు మహాదేవ దేవుడొక్కడే. ఇదే ఆత్మతత్త్వము. దీనినే బ్రహ్మ విద్య అందురు. సర్వవ్యాపి ఒక్క ఓంకారమే. ఈ రహస్యమును సర్వులకు తెలియజేయాలనే కోరికతో చిరకాలము నుండి తపస్సు చేయుచున్న సనకాదులు, పాణిని వినుచుండగా ఢక్క 14 సార్లు మ్రోగించెను ఈ ధ్వనులను వారు విమర్శించిరి. అవే అక్షర సమామ్నాయమను పేర పిలువ బడుచున్న ఓంకారమందుగల మొదటి అక్షరము అ. అ, అకారముతోనే ఈ మహేశ్వర సూత్రములు ప్రారంభమగును. అఇఉణ్ ....... మొదలుగాగల 14 సూత్రములు. వీటి నాధారముగా గైకొని పాణిని అష్టాధ్యాయి రచించెను. మహేశ్వర సూత్రములందలి తత్త్వమును తెలుపుటకై నందికేశ్వరుడు "కాశిక" రచించెను. దానికి ఉపమన్యుడు తత్త్వవిమర్శ రచించెను. దానికి అక్షరజ్ఞుడు ప్రణవవల్లి రచించెను. ఓంకార తత్త్వము నుపదేశించుటకే పరమేశ్వరుడు కృతయుగములో దక్షిణామూర్తిగాను, త్రేతాయుగమున గురుదత్తునిగాను, ద్వాపరమున వ్యాసునిగాను, కలికాలమందు శ్రీశంకర భగవత్పాదులుగాను అవతరించి. ఎందరినో తరింపజేసిరి. ఇదే ఓంకార దర్శన రహస్యము.

ఓం నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైక మూర్తయే ।
నిర్మలాయ ప్రశాంతాయ దక్షిణామూర్తయే నమః ॥

శ్రీ మహావిష్ణువు ఓంకారాన్ని ధ్యానించి విష్ణుత్వమును పొందెను పరీక్షిన్మహారాజు, శ్రీ శుకులవలన మహాభాగవతమును ఏడురోజులలోవిని జ్ఞానసంపన్నుడై ఓంకారమును ధ్యానించి ముక్తి పొందెను.

శ్లో॥ ప్రణవాద్యాస్త్రయో వేదాః ప్రణవే పర్యవస్థితాః,
వాఙ్మయం ప్రణవం సర్వం తస్మాత్ప్రణవ మభ్యసేత్॥

మూడు వేదములును ఓంకారమే మొదటగాగలవి. ప్రణవము చేతనే ఆ వేదములు సమాప్తిచెందినవి. సకలవాక్కులును ఓంకార స్వరూపములే. అందువలన ఓంకారమును - ఒక్కదానిని జపించినచో సమస్త మంత్ర జపములును, సమస్త వేదాధ్యయనమును చేసిన ఫలము కలుగును. మూడు వేదాలు ఓంకారముతో ప్రారంభింపబడి, ఓంకారముతో ముగిసినవి.

"ఓం అగ్నిమీళే పురోహితమ్ ...." అని ప్రారంభింపబడినది, ఋగ్వేదము,
"ఓం ఇషేత్వోర్జే త్వావాయనః..." అని మొదలుగాగలది, యజుర్వేదము.
"ఓం అగ్న ఆయాహివీతయే ...." అని మొదలుగాగలది, సామవేదము.

ఈ వేదములు "ఓం" కారముతోనే ముగిసినవి. సకల మంత్రములు ఓంకారముతోనే ప్రారంభింపబడును. "ఓం నమశ్శివాయ", "ఓం నమోనారాయణాయ", "ఓం శ్రీరామ్ జయ్ రామ్, జయజయరామ్" ఈ రీతిగా సకలమంత్రములకు ఆది "ఓం"కారము. ఆ మంత్రార్థములన్ని ఇందుగతార్థములు. మంత్రములన్నింటిలోను ఉత్తమోత్తమమైనది, మంత్రరాజమనబడునది - గాయత్రీ మంత్రము. "న గాయత్ర్యాః పరం మంత్రం" అందురు. ఈ గాయత్రి మంత్రమును మించిన మరొక మంత్రములేదు. గాయత్రివంటి మంత్రము ఒక్క గాయత్రియే. గాయత్రి

మంత్రార్థము - ఓంకారమే. "గాయంతంత్రాయతే యస్మా ద్గాయత్రీ తేన కథ్యతే" గానము చేయువానిని, రక్షించునది గావున దీనికి గాయత్రి అని పేరు. గానము చేయుటనగా మననము చేయువానిని రక్షించునది. ఈ మంత్రము మూడు వేదములందును గలదు. ఈ మంత్రము ఒక దేవతకుగాని, ఒక సంప్రదాయమునకుగాని సంబంధించినదిగాదు.

ఓంకార పరబ్రహ్మ సచ్చిదానంద స్వరూపుడును, సర్వజగజ్జీవన హేతువును, సమస్త దుఃఖహర్తయు, సుఖస్వరూపుడును అగు ఏ పరమేశ్వరుడు, మా యొక్క బుద్ధులను ఉత్తమ గుణకర్మ స్వభావముల యందు ప్రేరేపించుచున్నాడో అట్టి సర్వస్రష్టయు, స్వయం ప్రకాశ స్వరూపుడును అగు పరమాత్మ యొక్క ఆ సర్వశ్రేష్ఠమైనట్టి అజ్ఞానాంధకార నాశక తేజస్సును మేము ధ్యానము చేయుచున్నాము". ఇదేగాయత్రీ మంత్రార్థము.

ఈ రహస్యమునే గీతాచార్యులు — గీతలో పలుచోట్ల వివరించి యున్నారు. "ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మ........"

"ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః, "తస్మాదో మిత్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః॥ గీతాచార్యుల వాణి. ఈ ఓంకారమునకే ప్రణవమని, ఉద్గీథమని, ఏకాక్షరమని" తారకమని, శబ్ద బ్రహ్మమని నామాంతరములు గలవు. ప్రణవమనగా మిక్కిలి స్తోత్రము చేయబడునది. ప్రకృష్టమైనది. ణు = స్తుతి చేయు ధాతువు నుండి వచ్చిన నామవాచకము. ణుస్తుతౌ, "నవః"॥ప్ర + నవః = ప్రణవః "దీనిచే బ్రహ్మము స్తుతింపబడుచున్నది". కావున ఇది "ప్రణవము. ప్రణూయతే ఇతి — ప్రణవః - లేక ఓంకారము (బ్రహ్మ).

అథఖలు య ఉద్గీథః సప్రణవోయః ప్రణవః స ఉద్గీథ ఇత్యసావా ఆదిత్య ఉద్గీథ ఏషప్రణవః ఓమితి హ్యేష స్వరన్నేతి"-శ్రుతి.

న క్షరతి న సంచలతి న వినశ్యతి ఇత్యక్షరం బ్రహ్మ. యః సామగాః ఉచ్చైర్గాయంతి సఃతం ఉద్గీథమ్, ఉద్గీథ శబ్దవాచ్యమ్.

"ఓ మిత్యే తదక్షర ముద్గీథ ముపాసీత । ఓమితి హ్యుద్గాయతి తస్యోపవ్యాఖ్యానమ్ ॥శ్రుతి॥ దీనినే ఏకాక్షర మందురు.

సమస్త దుఃఖములనుండి, సకల భయములనుండి తరింప జేయునది కావున ఓంకారము తారకమనబడును. అనగా సంసారము నుండి తరింపజేయునది. తారణ చేయుట వలన ఓంకారము తారకమని పిలువబడు చున్నది. "దేవాశ్చేతి సంధత్తాం సర్వేభ్యో దుఃఖభయేభ్యః సంతార యతీతి తారణాత్తారః॥" "ఓం"కారమునకే - శబ్దబ్రహ్మమను నామాంతరము గలదు. ఇదియే ఓంకారదర్శన రహస్యము.

ఓంకార ధ్యానామృత వాయువులు, వాతావరణ కాలుష్యాన్ని హరింపజేసి, పచ్చదనంతోపాటు అటవీసంపదలను కాపాడి, అరణ్యాన్ని పర్యావరణాన్ని రక్షించి, నరుని నారాయణునిగా మలచును. అందుకే సమస్త ప్రాణులను కాపాడి సకాల వర్షాన్నిచ్చి, ఇహలోకంలో ఆయు రారోగ్య ఐశ్వర్యాలతో హర్షాన్నిచ్చి, పరంలో మోక్షాన్ని ప్రసాదించే ఓంకారాన్ని అందరూ త్రికరణ శుద్ధిగా ధ్యానించి తరింతురు గాక.

ఓం తత్సత్

6-99-00.

  

40